విశ్వసాహిత్యమాల ౧౯.

# చీనా కథలు.

ఆస్వాల్డు ఎర్డ్‌బర్గ్.

అనువాదం:

మహీధర జగన్మోహన్ రావు.


విశ్వసాహిత్యమాల

ముంగండ. [వయా] అంబాజీపేట.

# Tales of Modern China,

Oswald Erdberg.

1930.

# చీనా కథలు,

1938.

అవంతీ ప్రెస్,
ముంగండ.

వెల 4 అణాలు.

3/6/30

# తొలి పలుకు.

మళ్లీ యిన్నాళ్లకి ఆంధ్రపాఠక మహాశయుల చేతుల్లో కొత్త పుస్తకాలను వుంచగలుగుతూన్నాం. అన్నీ యథాపూర్వంగా నవయుగారంభకమైనవే! ప్రస్తుత కాలాని కవసరమైనవే!! ఉజ్జ్వలభావ ప్రబోధకమైనవే!!! అంతేగాదు. కాగితాల ధరలు హెచ్చినా, పుస్తకాల ధరలు మాత్రం హెచ్చించదలచుకోలేదు. మా ఆదర్శాలను ప్రజలు గ్రహించడానికి, ఈ విషయం ఒక్కటే చాలును.

ముందుగా చెప్పవలసిన సంగతి ఒకటి మరచిపోయేను. రెండేళ్లు గ్రంథమాల సంపాదకులుగా పని చేసి, పది పుస్తకాలు ప్రకటించి, ప్రజోద్యమానికీ, తెనుగు భాషకీ అమూల్యసేవ జేసిన కృష్ణమోహన్ తన సంపాదకత్వాన్నుంచి విరమించుకున్నారు. నేనే

మైనా చేయలేనా యని సాహసించి, ఆ భారాన్ని నేను వహించేను. కానైతే యీ పని నాకు క్రొత్త గాదు. కాని, ప్రస్తుత పరిస్థితుల్లో,- యుద్ధంమూలాన పుస్తకముద్రణ కవసరమైన పరికరాలన్నీ దాదాపు రెండు మూడు రెట్లు హెచ్చిపోయి వున్న, యీ రోజుల్లో,- స్వేచ్ఛాభావ ప్రకటన నరికట్టే 'ఆర్డినెన్సు' స్వైరవిహారం చేసే ఈ రోజుల్లో,- ఈ కార్యానికి పూనుకోడం సాహసం కాదూ?......

ముందునుంచి యెక్కువగా నవలలు, నాటకములు, కథలు ప్రచురిస్తాము. అవైనా కేవలమూ ఉబుసుపోకకు కాదు సుమండీ! అంతర్జాతీయ సాహిత్యంలోవున్న 'జాతి రత్నాల్నే' ఏర్చి, ప్రచురిస్తాము. సిద్ధాంతగ్రంథాలు కూడా అప్పటప్పట వేస్తూనే వుంటాము. కాని, అసలు కట్టిపెట్టము.

స్వతంత్రగ్రంథాలు ప్రకటించరేమని ఎందరో అడుగుతూంటారు. అనువాదాలే ముఖ్యంగా ప్రకటించడంలో ఒక సౌకర్యం వుంది. ఇంగ్లీషు భాషలో ఆయా విషయాలమీద ప్రత్యేకకృషి చేసిన వేత్తలు

రచించిన ఉద్గ్రంథాల్ని మేము ప్రకటిస్తూన్నాము. అంతర్జాతీయవిజ్ఞానరంగంలో ధృవతారల వంటి గ్రంథాల్నే, మేము తీసుకుంటున్నాము. పదిపుస్తకాల్ని చదివి, వ్రాయాల్సిందే కాని తెనుగు గ్రంథకారులు ఆ యా ప్రదేశాలకి స్వయంగా పోయి, చూసి, వ్రాయడాని కవకాశాలు బహుతక్కువ. అందువల్ల ఒక విధంగా చూస్తే, అనువాదాలకే మన భాషలో ప్రస్తుతం ప్రాముఖ్యత ఈయాలేమో! ఏదెల్లా వున్నా భవిష్యద్గ్రంథకారుల మార్గాన్ని యివి సుగమం చేస్తాయనడంలో సందేహం లేదు.

గ్రంథమండలి సాగుటలో ఎందరో స్నేహితులు తోడ్పడినారు. ఈ సందర్భంలో కామ్రేడ్ దర్శి చెంచయ్య, సుభద్రమ్మ గారల అమూల్యసహాయం మేము మరిచిపోజాలము.

ముంగండ, మహీధర జగన్మోహనరావు,
జనవరి '40. సంపాదకుడు.

*      *      *      *

ఈ మూడుకథలూ Tales of Modern China అనే గ్రంథంలో నుంచి తీసుకున్నాను. ఎర్డ్‌బర్గ్, స్వయంగా చీనా యంతటా పర్యటన చేసి, కళ్లారచూసి వ్రాసిన కథ లివి. కళావైదగ్ధ్యం అంతగా లేకున్నా, చీనా కార్మికుల, కర్షకుల, సైనికుల పరిస్థితుల్ని, ఈ కథలు ప్రతిఫలిస్తూంటాయి. కొద్దిరోజుల్లో చీనా జాతీయోద్యమాన్ని గూర్చి తెలిపే కథల్ని కూర్చి, ప్రకటించగలము.

అనువాదకుడు.

# చీనా కథలు.

అతిరథులూ, మహారథులూ.

ధర్మ సందేహం.

రైతుల తిరుగుబాటు.

# అతిరథులూ - మహారథులూ.

లుంగ్-హాయ్ రైల్వేమీద పోరాటాలు జరిగిన ఆరోజులు మరపురావు.

నలుగురి సేనలూ అక్కడ పోగుపడినాయి. అందరూ ఒకరికొకరు శత్రువులే. మొనలు ఒక్కొక్కసారి చెదిరిపోతూ మళ్ళీ సమకూడుతూన్నాయి. పోరాడుతూన్న సేనాధిపతులు తమతమ గూఢచారుల్నీ, రాయబారుల్నీ, ఒకరొకరిదగ్గరకు మెడతెగక పంపుకుంటూన్నారు. ఈక్షణంలో మిత్రులుగా వున్నవాళ్లు మరుక్షణంలో శత్రువులుగా మారిపోతున్నారు. చాలామందికి ఏపక్షంలో పోయిచేరడమో ఇంకా తేలలేదు. ఎత్తుపైఎత్తులు నడుస్తున్నాయి. పటాలాలలో కుట్రలు జరగడం వల్ల 'ఫీల్డు మార్ష

ల్సు' పదేసి రోజుల కొకరు మారిపోతూ వున్నారు. హూనాన్ రాష్ట్రం అంతా సర్వనాశనం అయిపోయింది. ఆకలితో ఆవురుమంటూ, కట్టుగుడ్డలు పీలికలయి జీరాడుతూంటే, మురికి శరీరాలతో సైనికులంతా గుంపులు గుంపులుగా గ్రామాలంట తిరుగుతున్నారు. పైరుపంటలు తొక్కుకుంటూ, రైతుల గాదుల్లో మిగిలి వున్న కొద్ది గింజల్ని కూడా ఊడ్చివేసి తీసుకుపోతున్నారు. రోడ్లప్రక్క మురికికాలవల్లోనూ, పల్లాలలోనూ, శవాలు కుళ్లుతూ, సంస్కారం చేసేవాకేనా లేక పడివున్నాయి. మాలకాకులు గుంపులు గుంపులుగా ఎగురుతూ, శవాల్ని పీక్కుతింటున్నాయి. రైతులు దూడా దుడికినీ తరిమివేసి పెళ్లాం-పిల్లలతో పర్వతాల్లోకి పారిపోయేరు. పర్వతాల్లో దాక్కొని వుంటూనే అడపా దడపా రోడ్ల మీదికి గుంపులుగా వచ్చి కర్రలతోనూ, పాతకత్తులతోనూ, పటాలాల్లోంచి విడివడి తిరుగుతూవున్న సైనికుల్ని చంపి పారేస్తూన్నారు. యుద్ధం అంటూ చెప్పుకో తగిన పోరాటాలు జరక్క పోయినా,

దోపిళ్లూ, పెద్దపెద్ద లంచాలూ, నమ్మిన వాళ్లనే ద్రోహం చేయడం, యివి నిత్యకృత్యాలై పోయి నాయి. సేనాధిపతు లందరూ స్వార్థాపేక్షతో తమ లో తాము ఒడంబడికలు చేసుకుంటూ, వర్తకులుగా తయారయ్యేరు. జరగబోయే యుద్ధాలు కూడా వాళ్ల వర్తక షరతుల మీదనే ఆధారపడి వుంటున్నాయి.

నేనూ, పాండూ, "హొయాంగ్-హొ" నదీతీరాన్నే వున్న రయిలుస్టేషన్ చేరుకున్నాము. పడమటికి పోవాలని మా ఊహ. స్టేషను నుంచి పో వలెనని మేము చేసిన ప్రయత్నాలన్నీ విఫలం అయి పోతున్నాయి. ముక్డెన్ సేనలు కొద్దిరోజుల్లో స్టేషన్ ఆక్రమించుతాయని చెప్పుకుంటున్నారు. ఆ రోజున రాత్రంతా చాలా ఉక్కగావుండి, తెల్లవార్లూ కన్ను మూతపడలేదు. తెల్లవారింది. ఇంక ఆ రోజున తప్ప కుండా ఆ పాడు ప్రదేశాన్నుంచి వెళ్ళిపోయేందుకు కడపటి యత్నం చేద్దా మనుకొని, సేనాధిపతి సహా యం స్వయంగా పోయి అడుగుదామని స్థిరపరచుకు న్నాము.

సేనానివేశం రైలుస్టేషనులోనే వుంది. సేనాధిపతి మకాం కూడా రైలుపెట్టెలోనే. ఆ పెట్టె దుమ్మూ, ధూళీతో, నిండి పాడుకంపు కొడుతూ వుంది. సేనాపతి మాత్రం మమ్మల్నెంతో సౌజన్యాంతోటీ, ఆదరం తోటీ, దర్జాగా గౌరవించేడు. సమయోచితంగా మర్యాదలూ, లాంఛనాలూ, జరిగించి పాండూ ప్రాగ్దేశవాసులకి సహజమైన చాకచక్యముతో మాటలాడడం ఆరంభించేడు. ఏలాగైనా ముందు పరిస్థితుల్ని గురించిన వాకబు అంతా ఆతని నుంచి లాగాలని పాండూ ప్రయత్నం.

రైలుపెట్టె కిటికీల అద్దాల తలుపులు వేసి వున్నాయి. అద్దాలమీద యీగలు వాలి, తెగ ముసురుతూండడం వలన లోపల వెలుతురు మసక మసకగా వుంది. సేనాధిపతి మొహం వాడిపోయి వుంది. అతగాడికున్న అధికారం కొద్దిపాటిదే. అతడి పరిస్థితులు విషమంగా వున్నట్లు ముఖలక్షణాలే చెబుతూన్నాయి. జడ్డోడుతూ, చెమటలు కారుతూన్న ఆతని ముఖం వేపు ఆతురతగా చూస్తూన్నా నేను.

అదివరకే మాకు ఈ సేనాపతి చరిత్రంతా తెలిసింది. అతని క్రిందవున్న సైన్యాలు తక్కువే. "టీన్‌ట్సిన్" మొదలుకొని "హానాన్" వరకూ వున్న దేశం అంతటా, ఒక "ఫీల్డు-మార్షల్" దగ్గర నుంచి మరొకడి దగ్గరకి చెడ తిరుగుతున్నాడు, సపరి వారంగా. కాని, పాపం! ఈతడి కోరిక యింకా ఫలించనే లేదు. "టూపాన్" అనే బిరుదూ, నిరాఘాటమైన, నియమితమగు రాబడితో, నల్లమందు వర్తకం చేసికొనే హక్కుతో, కొందరు ఉంపుడుకత్తెల్ని పెట్టుకొని ప్రశాంతంగా జీవితం గడపుకొనే అవకాశాన్ని యే పరగణాలోనైనా సరే సంపాదించాలని అతని ఆశ. ఆదర్శం కూడాను! కాని తీవ్రంగా జరుగుతూన్న యుద్ధాలవల్ల ఒక చోటనుంచి మరొక చోటికీ, ఒకయుద్ధరంగం నుంచి మరో రంగానికీ పరుగెత్తుతూన్నా యింతవరకూ ఇతగాని మనోరథాలని ఈడేర్చిన "ఫీల్డు-మార్షల్" కనిపించలేదు. తల మునిగిన అప్పులూ, మితిమీరిన ఖర్చులూ, మనోవ్యాకులతా, నిత్యమూ నూతనమిత్రుల్ని-యజమా

నులీస్తు, వెతుక్కోవలసిన అవసరం; ఈ బాధలకి తోడు అసజయాలలోటీ, మిత్రద్రోహాలతోటీ, ఆత గాని ప్రాణాలు విసికిపోయినాయి. స్వంతవ్యాపారా లన్నీ అశ్రద్ధచేస్తూరావడంతో రాబడి తగ్గిపోయింది. మరో సేనాపతితో కలిసి జాయింటుగా నడుపుతూ వున్న "బట్టలమిల్లు" వలన రాబడి తగ్గిపోవడమే కాకుండా ఆ జాయంటుదారు శతృవులలో కలిసి పోయేడు. అందుచేత నిరుత్సాహపడి యెక్కడికీ కద లక రైలుపెట్టెలోనే పాతుకుపోయేడు. చిట్టచివరకి అల్పాచమానానికి కూడా బయటికి కాలు పెట్టడం లేదుట. రైలుపెట్టే యీతనికి ప్రపంచం అయిపోయి నది. అందులోనే ఇతర జనరల్సు పంపిన అంగరక్షకు లకీ, రాయబారులకీ, విందులూ-వినోదాలూ జరిగిం చుతూ, ప్రతివిందుకీ డబ్బు తగలేసి ఫ్రెంచిసారాయి, చిన్న పిట్టల పులుసు, యింకా అపరూపమయిన రుచ్యపదార్థాలు, తెప్పించుతూ కాలక్షేపం చేస్తు న్నాడు.... ... ... ...

ఆతడు ఉత్తరకుమార ప్రజ్ఞలు చెప్పడం ఆరం

భించేడు. "మీకేం ఫర్వాలేదు. ధైర్యంగా వుండండి. ముక్డెన్ సైన్యాలింకా కొన్ని రోజుల వరకూ నదిని దాటిరావడానికి ప్రయత్నించవు. ఈ లోగా నా సేన లన్నింటినీ పోగుచేసికొని శత్రువుల్ని డొక్క బద్దలు చేసేస్తా......" నంటూ వేలితో మ్యాప్ మీద చూపించేడు, ఏమిటో.

తన మాటలు మేము నమ్మేటట్లు చేయాలని తాపత్రయపడుతూ, ఏలాగయినా యీ ప్రస్తావన మార్చుదామని ప్రయత్నించుతూన్నాడు. 'శాన్ కో' అనే గ్రంథాన్ని బల్ల మీది నుంచి తీసి, అందులో వున్న కథలు చెప్పడం ఆరంభించేడు. "పసుపు నది" [హోవంగ్ హూ] మైదానాలలో పూర్వకాలంలో జరిగిన యుద్ధాల కథలూ, ఏనాడో చచ్చి స్వర్గాన వున్న మహావీరులు ప్రదర్శించిన యుద్ధకౌశలమూ, రాజనీతీ, చాతుర్యమూ,-శత్రుసేనల్ని భస్మం చేసిన సుడిగాడ్పుల్ని గురించీ, నౌకాయుద్ధాలలో పాల్గొనిన పెద్దనౌకల్ని గురించీ, వందలకొలదీ మైళ్ళు ఒకే రోజున ప్రయాణం చేసిన అద్భుతమయిన గుర్రాల్ని

గురించీ, "టోన్-టోన్ "యుక్తి ప్రయుక్తులూ, 'చు-గొ-లియాన్' స్వామిభక్తీ, విశ్వాసమూ, వీటిని గురించీ, పూర్వగాథలన్నీ వర్ణిస్తూంటే మా ప్రాణం విసికిపోయింది.

ఎంతో సేపు చెప్పిచెప్పి నోరు నొప్పెట్టి చాలించేను. మేమూ అతడి దగ్గర సెలవు తీసుకొని బయటికి వచ్చేసేము. స్టేషను ప్లాట్‌ఫారంమీద సేనాధిపతి అంగరక్షకులు కూర్చుని బాతాఖానీ కొడుతున్నారు వెడదరొమ్ములూ వాళ్ళూ మంచిబలంగా వున్నారు, వాళ్ళంతా. ప్రతివాని దగ్గరా 'మాజర్' [ఒక రకం తుపాకి] లున్నాయి. పైన యెండ మండిపోతూంది. వాళ్ళ కమేండరు, ఏవో రాజకీయపాఠాలు దంచేస్తూవుంటే వీళ్ళంతా వింటున్నారు. కమేండరు ఒక్కక్కడినే "సన్యట్ సేను ఎవరు? ఐదు హక్కులు గల రాజ్యాంగం అంటే ఏమిటి?" అని అడగడం; వాడు లేచి నిల్చుని సమాధానం జ్ఞాపకం రాక గుటకలు మింగుతూంటే, కమేండరు ఛెడీలుమని రెండు తగిలించడం; వాడు బుర్రబరుక్కుంటూ, సణుక్కుంటూ,

కూర్చోడం; వాని ప్రక్కవాడు లేచి అదివరకే బట్టీ పట్టిన కొన్ని వాక్యాల నేకరువు పెట్టికూర్చోడం; యిదీ అక్కడ జరుగుతూన్న తంతు.

ముందుకు పోదా మనుకుంటూంటే వెనుక నుంచి యెవరో నా చొక్కా పట్టుకులాగేరు. వెనుకకు తిరిగిచూడగా ఒక రష్యను రైతు నిలబడియున్నాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. చింపిరి గడ్డం, రాగివెంట్రుకలు, ఆకుపచ్చని కళ్ళు, ఎండ దెబ్బకి వాడిపోయిన ముఖమూ వాడూ; చీనాసైనికుని వేషముతోవున్న ఆతడు చేయివూపి నన్ను పిలుస్తూ, 'నీవు రష్యను వాడివా?' అని ప్రశ్నించేడు.

నేనూ అతన్ని తీసుకుని స్టేషను నీడకి వెళ్ళేను. తాను ఉరల్ రాష్ట్రంలోని కోసక్కు సైనికుడి ననీ, వెనక "అన్నెన్ కోవ్" సేనలలో పనిచేసేవాడి ననీ, చెప్పేడు. ప్రస్తుతం యీ సేనాపతి దగ్గర మెషీన్ గన్-మాన్ గా పనిచేస్తూన్నాడు. రైలుపెట్టె కిటికీ క్రింద నిల్చుని తాను పాండూకీ సేనాపతికీ జరిగిన సంభాషణ నంతనీ విన్నానని చెబుతూ 'మీరు

భయపడవలసిన పని లేదు. ముక్డెను సేనలు నదిని దాటనే దాటవు.' అన్నాడు.

"ఇక్కడి నుంచి తూర్పుగా యేభై కిలో మీటర్ల దూరంలో [ముప్పై మైళ్ళు] ముక్డెన్ సేన లన్నీ నదిని ఈవరకే దాటి యీవలకి వచ్చేసేయి. ఈవేళ రాత్రే సేనాపతీ, ఉద్యోగులూ, చాలావరకు సైనికులూ, కూడా యిక్కడినుంచి వెళ్ళిపోతారు. మిగతా వాళ్ళం అందరం కూడా రేపు వెళ్ళిపోతాం.' అంటూ కన్నార్పకుండా ఆ రష్యను సైనికుడు నా వేపు చూసేడు.

మా మెద్రస్ వాని చేతికిచ్చి, ఏదేనా విశేషం వుంటే మాతో చెప్పమని, మా మకాం వేపు వెళ్ళిపోయేము.

మరునాటి వుదయాన్నే ఫిరంగిమ్రోతలు విని ఉలికిపడి లేచే సరికి గోలా, గంద్రగోళం వినిపించింది. మేము పరుగెత్తి, ముంగిటిలోనికి వచ్చేసరికి సత్రపు యజమాని వంకరనవ్వులతో 'ముక్డెను సైన్యాలు పట్టణానికి ఐదు కిలోమీటర్ల దూరంలో వున్నాయి.

కొండమీద ఫిరంగుల్ని వుంచి పట్టణాన్ని అప్పుడే ముట్టడించుతూన్నారు.' అన్నాడు.

రైతులు భీతాంగంతో తను సామానులన్నీ గాడిదల మీద కట్టుకొని, బొంగురుగొంతుకలతో తిట్టుకుంటూ తోలుకుపోతున్నారు, పట్టణం విడిచి.

మేమూ ఒకటే పరుగున రైలుస్టేషనుకి పరుగెత్తిపోయేము.........నిన్నటి కోసక్కు మాకు దారిలో కనిపించేడు. మమ్మల్ని ఆగమని చేతితో సంజ్ఞచేసి వేలితో ప్రభుత్వభవనం వేపు చూపించేడు. చిన్నలాగులూ, బనియనులూ, ధరించిన చీనా వాళ్ళు ఆ భవనం మీదినుంచి కుమింటాంగ్ జెండా గబగబా దింపివేస్తున్నారు. దించి, మెల్లగా మడచి సంచీలో భద్రపరచి, ముక్డెను సేనలకి చెందిన ఐదు రంగుల జెండా పైకెత్తేరు.

స్టేషను అంతా భీభత్సంగానూ, గందరగోళంగానూ, వుంది. సేనాపతి అప్పుడే ఒక ట్రెయినులో వెళ్ళిపోయేడు. మేమక్కడ వుండగానే ఇంకో బండి వచ్చి ఆగింది. దానికి సామానుపెట్టెలూ, ఓపెన్

బ్రక్కలూ, వందలకొలదీ తగిలించివున్నాయి. వాటి నిండా సైనికులే. పెట్టెల పక్క చెక్కల మీదా, బఫర్ల మీదా, పైకప్పులమీదా, యింజనుమీదా, టెండరులోని బొగ్గుమీదా, [ఇంజను వెనక బొగ్గువేసే పెట్టె] కూడా సిపాయీలు కిక్కిరిసి కూర్చున్నారు. కొంచెం చోటు సంపాదించుదామని మేము చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయిపోయినాయి. పడమటికి పోయే బళ్ళు ఇంకా ఏమయినా వున్నాయేమోనని కనుక్కురావడానికి మాతో వున్న కోసక్కు వెళ్ళేడు. మేము సామానులరాసి వెనుక ఒదిగి నిలుచున్నాము. ఎవరూ మమ్మల్ని పరిశీలనగా చూడకుండా మా వేషాలు మార్చుకున్నాము. పరుగెత్తి పోతూన్న సేనలు అంతర్జాతీయ నియమాలు పాటించుతారనీ, మాకేమీ ప్రమాదం తెచ్చిపెట్టరనీ, ఏలాగ అనుకోవడం? సైనికులు గుంపులుగా వెళ్ళి ప్రక్కలైనుల మీదనున్న సామానుపెట్టెల్ని 'హో'మని లాక్కువచ్చి మెయిను లైను మీదికి తోసి వాటిల్లోకి ఎక్కుతూన్నారు. వాళ్ళ గోల పట్టశక్యం కాకుండా వుంది.

రైల్వే కూలీలు భయపడుతూ అటూ ఇటూ కంగారు పడుతూ తిరుగుతున్నారు.

మధ్యాహ్నం అయ్యేసరికి స్టేషను మీదనే ఫిరంగిగుళ్ళు కురవడం ఆరంభించేయి. ఇంకో ట్రెయిన్ కూడా బయలుదేరి పోయింది. కాని మాకు అందులోనూ స్థలం చిక్కలేదు. మిగిలిన సైనికుల్లో చాల మంది తమ చొక్కా చేతులకి తగిలించుకొన్న బాడ్జిలనీ, టోపీల మీది నేషనల్ ఆర్మీ తురాయీలనీ, పీకి పారేసుకుంటున్నారు. కొందరు రైలుకట్ట వెంబడినే పశ్చిమానికి పరుగెత్తడం ప్రారంభించేరు. ఇంక ఏమాత్రమూ లాభం లేదని నిరాశతో వెనుక తిరిగి పోతూంటే, మా కోసక్ కనిపించేడు. మా కోసం తాను ప్లాట్‌ఫారం మీద తెగ వెతికేనంటూ, మా ఇద్దరినీ వెంటపెట్టుకుని పట్టాల వెంబడే రెండుమూడు కిలోమీటర్ల దూరం తీసుకుపోయేడు. అక్కడో సైడింగులో చిన్న ట్రెయిను బయలుదేరడానికి సిద్ధంగావుంది. రెండు సామాను పెట్టెలు, రెండు ఓపెన్ గండోలాలు, చిన్న షంటింగుయింజన్ ఒకటీ, ఆఫీసర్ల

తాలూకు సామానంతా యిందులో తీసుకుపోతూన్నారు. మాజర్లు, తేలికైన 'లూయిస్' మెషీన్‌గన్‌లూ, పట్టాకత్తులూ ధరించిన సిపాయిలు యీ ట్రైయినుకు కాపలా యిస్తూన్నారు. కోసక్, మమ్మల్ని కమాండరుకు పరిచయం చేసేడు. ఈతడు సేనాధిపతి అంగరక్షకుల్లో ఒకడుట. సామాను పెట్టెల్లో ఒక మూల కూర్చోడానికి అనుజ్ఞ నిచ్చేడు కమాండరు. మేము వెళ్ళి లోపల కూర్చున్నాము. పెట్టె అంతా దుమ్ముతోనూ, చెత్తతోనూ అసహ్యంగా వుంది. ఇంతలో కోసక్ వచ్చి 'మనము ఆఫీసరుకు కృతజ్ఞత చూపా' లన్నాడు. నేను యేభై డాలర్లు తీసి, కోసక్ చేతిలో వుంచేను. ఎప్పుడు యీ పాడుస్థలం వదలి పోతామా అని వున్న మా ప్రాణం విసిగేలా పక్కా రెండు గంటలదాకా ట్రెయిను కదలనే లేదు. ఎంతో సేపటికి ఉక్కిరి బిక్కిరిగా ధూమ్రవర్ణమైన పొగను వదులుతూ, గుప్పుమని నిప్పురవ్వల్ని ఎగజిమ్ముతూ, ఒక్క కుదుపు కుదిపి, 'కంయ్' మంటూ యింజన్ కదిలింది. ట్రెయిన్ మహావేగంతో పోతూంటే ఎన్నో స్టేషన్లు

దాటిపోతూన్నాయి. ఎక్కడా మా బండి ఆగడం లేదు. ప్రతి స్టేషనూ సైనికులతో నిండి, గందరగోళంగానేవుంది. వాళ్ళంతా మా ట్రెయిన్ పోతూంటే ఉలిక్కిపడి, బండి దాటిపోయిం తర్వాత మావైపు తుపాకులు పేలుస్తూన్నారు.

రాత్రి సమీపిస్తూంది. సాయంత్రపు సూర్యుని రక్తారుణ కిరణాలు తేమగావున్న బయలులోని పచ్చిక మీద పడి వింత శోభ కలిగిస్తూన్నాయి. పగలల్లా పొలాల్లో పనిచేసుకుని అలిసిపోయి, నాగళ్ళు భుజాలమీద పెట్టుకొని, కాళ్ళీడ్చుకుంటూ, యిండ్లకుపోతూన్నారు, నీలిరంగు గుడ్డలు చినిగి జీరాడుతూంటే. బక్కచిక్కిన పశువుల్ని నీరసంగా అదలిచుతూ, వెదురు కర్రలు బుజాలమీదుగా ఆనుకుని, నడిచి పోతున్నారు, పశులకాపరులు. ఇక్కడంతా రైల్వేలైన్, "హ్వాంగ్- హో" నది ననుసరించే పోయింది. దూరాన బురదనేలల్లో, ఒండ్రులంకల మధ్యగా తళతళ లాడే వెండి నీటితో, పసిమినురగలు గ్రక్కుతూ, "హ్వాంగ్- హో" నది అమా

యికంగా ప్రవహించి పోతూంది.

ట్రెయిన్ ఎక్కడా ఆగడంలేదు. చీకటిపడింది. మా బండి తలుపులు తెరిచేము. దానిలో నేనూ, పాండూ, కోసక్, ముగ్గురమే వున్నాము. చల్లగాలి కోసం కాళ్లు క్రింది చెక్కల మీద పెట్టుకుని పెట్టె చివర కూర్చున్నాం, చుట్టలు కాల్చుకుంటూ. కాటిక లాంటి చీకట్లో నారింజ పళ్ళలాంటి నక్షత్రాలు కన్నుల పండుగ చేస్తూన్నాయి. నీరవనిబిడాంధకారం చుట్టూ ఆవరించివుంది. దూరాన వున్న నా జన్మభూమి జ్ఞాపకంవచ్చి, అప్పుడు గడపిన రాత్రులయొక్క మధుర స్మృతికి చకితుడనయేను. కోసక్, చేతులు మోకాళ్ల చుట్టూ వేసుకుని అటూయిటూ ఊగుతూ పాటలు పాడడం ఆరంభించేడు. వేగం యేమీ తగ్గించకుండానే హఠాత్తుగా ట్రెయిన్ ఒక సొరంగం లో ప్రవేశించింది. చుట్టూ చిమ్మచీకటి. పొగ ఉక్కిరి బిక్కిరి చేస్తూంది. మసీ,నిప్పురవ్వలూ, మా బట్టల మీద పడి చురుక్కుమంటున్నాయి. దడాలున ట్రెయిను సొరంగం దాటింది. చల్లని గాలి సోకి మా

ప్రాణాలు లేచొచ్చేయి. నోట్లోపడ్డ మసిబొగ్గు నెరుసుల్ని ఉమ్మేస్తూ, తలపంకించి కోసక్,

"మనం తుక్కు తుక్కు క్రింద ఎగిరిపోయి వుండాల్సిందే! కొంచెంలో తప్పిపోయిం దనుకుంటా" నన్నాడు.

'ఏం? ఎంచేత" అన్నాడు పాండూ, ఆశ్చర్యంగా.

"మనం బండిలో ఏమి తీసుకుపోతున్నామో తెలుసునా? ఇంజన్ తర్వాతి గండోలాలో మూడు వందలయేభై గ్యాసోలిన్ డబ్బాలున్నాయి. అదంతా ఆఫీసర్ల మోటార్లకోసమే. తొందరలో సరిగ మూత లతికించకపోవడం వల్ల కొంచెంగా కారుతున్నాయి. ఒక్క నెరుసు పడిందంటే, భగ్గున మండిపోతుంది. రెండో గండోలాలో తుపాకీవందుంది. లో-యాన్ ఆర్సినల్ కోసమై మందుగుండు తీసుకు పోతున్నాం. మందు పీపాలమీద కేవలం చింకిరి కీలుగుడ్డమాత్రం కప్పేరు. ఇంజన్ పొయ్యిలోనుంచి వచ్చే నెరుసులు పారంగాల్లో దూరానికి యెగిరిపోలేక వెనక వచ్చే బళ్ల మీద పడుతున్నాయి."

పాండూ బుర్ర బరుక్కుంటూ, కంగారుగా నా వేపు చూసేడు. బుజాలు కుదుపుకుంటూ నేను మరో వేపు తిరిగేను.

"మనం ఏమి చేయగలం? ఇంకా నయం ఈ ట్రెయిన్ మీదేనా రాగలిగి నందుకు సంతోషించాలి. ముక్డెన్ సైన్యాల్లో చిక్కుకున్నామంటే మన గతి వేరే చెప్పాలా?"

"ముందు యింకా వున్నాయా సొరంగాలు?" అని, పాండూ ఆదుర్దాగా ప్రశ్నించేడు.

కోసక్ సిపాయీ కళ్లు పరిహాసం చేసేయి.

'ఇక్కడి రైలుమార్గమంతా పర్వతాల్లోంచి పోయింది. తెల్లవారేలోగా పదిహేను-ఇరవై సొరంగాలు దాటిపోవాలి. లో-యాంగ్ అప్పటికిగాని చేరలేము. పోనిద్దూ, నాటి ముంపతెగా. యుద్ధపురోజుల్లో అన్నిటికీ సరిపెట్టుకోవాలి, మరి. నిత్యం చచ్చేవాడికి ఏడ్చే వాడెవడు?"

ఇల్లా అంటూ కోసక్ తన పూర్వగాథ చెప్పడం ఆరంభించేడు. జీవితం అంతా దేశద్రిమ్మరిగాను,

సిపాయిగాను, గడిపేడు. తనకి నిలవనీడ లేకుండా చేసి, పొట్టకూటి కోసం తోడి మానవుల్ని చంపవలసిన స్థితికి తెచ్చిన హతవిధిని గూర్చి చెబుతోంటే మాకే ఎల్లాగో అనిపించింది. కథ చెబుతో, ప్రతి ఇరవై నిముషాలకీ ఆగుతుండేవాడు. సారంగం వచ్చినప్పుడల్లా చిమ్మచీకటిలో, కముకుకంపుతో, నిప్పురవ్వలు మిణుగురుల మాదిరిగా ముసురుతోంటే, ఉక్కిరి బిక్కిరి ఐపోయేవాళ్ళం. అంతసేపూ యెప్పుడెగిరి పోతామా! అని పళ్ళు బిగించుకుని, ప్రాణాలు ఉగ్గపెట్టుకొని కూర్చునేవాళ్ళం. సారంగం దాటగానే ఒక్క నిట్టూర్పు వదిలేవాళ్ళం. కోసక్ విషాదగాథ మళ్ళీ ఆరంభమయింది.

మీసకట్టుకూడా రాని వయస్సులో వుండగా, ప్రపంచ సంగ్రామం ఇంక రెండేళ్ళకి వస్తుందనగా ఆతను సైన్యంలో చేరేడు. అప్పటికింకా పెళ్ళి కాలేదు. మిలిటరీలో మూడోయేడు సర్వీసు చేస్తూంటేనే యుద్ధం వచ్చిపడింది. యూరల్-కోసక్కుల పటాలాలతో బాటుగా జర్మన్ రంగానికి పంపబడ్డాడుట.

స్వేచ్ఛందంగా కాలుమీద కాలువేసికొని, హుకు ములు జారీ చేసే "రెన్నెన్ కాంఫ్" నాయకత్వం రష్యను పటాలాల్ని నడుపుతోంటే, వాళ్ళు మసూరియన్ సరస్త్రాలలోను, తూర్పు గెలీషియాలోను, రుమేనియారంగంలోను, టర్కిష్-ఆర్మీనియాలోను, కూడా పోరాడేరు. ఈ యుద్ధాలన్నింటిలోను ఇతడూ పాల్గొన్నాడు. రెండుసారులు ఖైదీగా పట్టుబడి, రెండుసారులూ తప్పించుకుపోయేడు. యుద్ధం ఆఖరయినాక, జారు సైన్యాలన్నీ చెదిరిపోయినాక, ఇతడూ తన జన్మస్థానం చేరుకున్నాడు. అక్కడనే వుండిపోవుదా మనుకుంటూ వుండగానే "జనరల్ కోల్చక్" తిరుగుబాటు లేవతీసేడు. అతని విప్లవవ్యతిరేకదళాలు ఈతణ్ణి తుపానులా లాక్కుపోయేయి. అయిదు సంవత్సరాలు అంతర్యుద్ధాలలో [సివిల్ వార్స] పాల్గొన్నాడు. మొదట కోల్‌చక్ వద్ద, తర్వాత అటమన్ సెమ్యోనోవ్ క్రిందా చివరకి అన్నెన్‌కోవ్ దగ్గరా పనిచేసేడు. "రెడ్ ఆర్మీ" ప్రచండసూర్యుడిలా విజృంభించడంతో అన్నెన్‌కోవ్ సేనలన్నీ పొగమంచులా

విడిపోయినాయి. మన కోసక్ పోయి పోయి, రష్యా సరిహద్దులు దాటి చైనాలో ప్రవేశించేడు. తోటి రష్యన్‌లతో కలిసి కొంతకాలమూ, తర్వాత ఒంటరిగానూ కూడా ఎందరో చైనా జనరల్స క్రింద పనిచేసేడు. చైనాకు వచ్చిన యీ అయిదు సంవత్సరాల్లోనూ, అనేక యుద్ధాలు చూసేడు. మైదానాల్లో, పర్వతాల్లో, ఎడారుల్లో, నదులమీదా, అనేక పోరాటాల్లో, స్వయంగా పాల్గొన్నాడు. జీవితమూ తనకి ప్రసాదించిన ఆ మారణవిద్యనే ఆరాధిస్తూ, యీ అయిదేళ్ళనుంచీ కాన్‌సూ, షెన్సీ, హోనాన్ మొదలైన పరగణాలన్నీ సంచారం చేసేడు.

"ఇప్పటికే పదహారేళ్ళుగా యుద్ధాల్లో పని చేస్తూన్నాను. నా జన్మభూమికి పోగలననే ఆశయింకేమీ లేదు. ఇక్కడ యేదో పొట్ట పోసికోన గలను. అన్ని రకాల మెషీన్-గన్‌లూ ఎరుగుదును. దీపం ఐనా అక్కరలేకుండా కటికచీకట్లో కూడా, మేక్సిమ్, కోల్టు, లూయిస్, ఏ మెషీన్‌గన్ అయినా సరే, అన్ని స్క్రూలూ విప్పి, మళ్ళీ అమర్చగలను.

ఎన్నివిద్యలు నేర్చినా, ఎంత చాకచక్యంవున్నా, నా జన్మభూమిని మళ్ళీచూడలేనుకదా! నా భార్య యే మైపోయిందో? నా భూమిని రైతులు పంచుకుని వుం టారు. నా గుడిసె నేలమట్టమై యుంటుంది. నేనూ యిక్కడ ముగ్గిపోతూనే వున్నా. ఎప్పుడో రాలిపో తాను. నా సమాధిమీద గుప్పెడు మన్ను వేసేవాం డెవడూ లేడుగదా! నా పేరు చెప్పే యీ విశాలప్ర పంచంలో ఏమీ మిగలదు. లోకం నా కళ్ళకు గంత లు కట్టి, ఈ దేశంనుంచి ఆ దేశానికీ, అక్కడ నుంచి మరో దేశానికీ లాక్కుపోతూంటే, నాతో వినోదంగా ఆడుకుంటూందా, అనుకుంటూంటా. చివరకి ఆ తు పాకీ గుండ్లకి కూడా నామీద దయలేదు. మృత్యువు కూడా నన్ను చూసి దూరంగా తొలగి పోతూంది. ఏ జనరల్ చూచినా పని చెప్పేవాడే కాని నాయిం టికి దారి చూపేవాడు లేడు......"

అన్నాడు, కోసక్ గడ్డం నిమురుకుంటూ, మెల్లిగా.

దయ అంటే ఎరుగని ఆతని హృదయము ద్రవిం చి, కంఠం రుద్ధమైపోయింది.

కోసక్ కథ పూర్తి అయింది. "భడేల్"మని ట్రెయిన్ మరో సొరంగంలో ప్రవేశించింది. సుళ్ళు తిరుగుతూ నిప్పు రవ్వలు మా మీద పడుతున్నాయి. సమీపంలోనేవున్న ఆపద తటాలున స్ఫురణకువచ్చి, నిర్విణ్ణులమైపోయేము.

రాత్రంతా ఒక సొరంగంలోంచి మరో సొరంగంలోకి పోతూ, మసికొట్టుకుంటూ, భయందహించే స్టేషన్లు దిక్కుచచ్చి, యింటికి మొహంవాచిపోయి వున్న కోసక్ చెప్పే కథలు విని కంపిస్తూ, గడిపేము. మాకు నిద్ర యెట్లా పడుతుంది? భళ్ళున తెల్లారే వరకూ నా కంటిమీద కునుకే లేదు. అంతులేని నా ప్రయాణాన్ని తలుచుకుంటూ, బందిపోటు దొంగలూ, హంతకులూ, స్వార్థపరులూ, అరాజకంగా దేశాన్ని పీనుగు పెంటలతోటీ, భస్మరాసులతోటీ, ముంచెత్తడం తలచి గుండెలు నీరవుతుంటే, మూస్తూనే పడుకున్నాను. తెల్లవారగట్ల లావుంది, ఒక్క కునుకు పట్టింది. కాని, అదైనా కోడికునుకే కాని నేద దీర్ఘవదిగా లేదు.

ఉషఃకాలం. తూర్పుదిశ యింకా ధూసరవర్ణ ముగానే వుంది. ట్రెయిన్ ఆగింది. మా పెట్టెనుంచి బయటికి వచ్చేటప్పటికి, యెదురుగా "లో-యాన్" నగరం కనిపిస్తూంది. అదో పురాతన నగరం. దుమ్ము మేఘాల్లా లేచి పట్టణమంతా క్రమ్ముకొని వుంది.

ఇక్కడియిళ్ళకు వేటికీ కిటికీలే లేవు. దర్వాజాలు నేలమట్టాని కున్నాయి. దుమ్ముకొట్టివున్న సిపాయీలు నిలబడి గుంపులుగుంపులుగా మాట్లాడు కుంటున్నారు. కంచర గాడిదలూ, ఒంటెలూ, విధీ విరామం లేకుండా తోరణాలుగా పోతున్నాయి. వాటన్నిటిమీదా తుపాకులూ, తోటాలపెట్టెలూ, పింగాణీపాత్రలూ, కుప్పకుప్పలుగా పేర్చి వుంచబడ్డాయి. ఈ మహాజనప్రవాహమంతా పడమటినుంచి తూర్పు దిక్కుగా ప్రవహిస్తూంది.

ఒకానొకప్పుడు యీపురాతన నగరం బహు సుందరముగా వుండేది. సిల్కుమజ్లినులకు, వేదాంతులకు, కుబేరుని తలదన్నే వర్తకులకు, సమస్తసంపదలకు ఆలవాలమై యుండే ఈ మహానగరం, నేడు

హద్దూ పద్దూ లేని సైన్యాలకీ, పటాలాలకీ, మధ్య మజిలీగా పనిచేస్తూంది. ఇక్కడికి పడమట నుంచి వచ్చిన సిపాయీలంతా పనికిమాలిన యుద్ధాల్లో చేరి పోరాడ్డానికీ, దిక్కులేని చావు చావడానికీ, పొట్ట చేతపట్టుకుని పోవలసిన వాళ్లేను. ఈ పట్టణాం దశ తిరిగి పోయింది.

మేము వచ్చిన ట్రెయిన్‌లో నుంచి గ్యాసో లిన్ డబ్బాలూ, తుపాకి మందు పీపాలూ, దింపేరు. చాలామంది సిపాయీలూ, ఆఫీసర్లూ, వాటి చుట్టూ మూగి ఏదో మాట్లాడుకుంటూన్నారు. మా కోసక్ భావగర్భితంగా చిరునవ్వు నవ్వుతూ, మా దగ్గరకు వచ్చి, వాళ్ళకేసి వేలితో చూపించేడు.

"చూసేరూ! రాత్రి మన ట్రెయిన్ ఎంచేత ముక్క ముక్కల క్రింద ఎగిరి పోలేదో, యిప్పుడేనా తెలిసిందా? మన ఆఫీసర్లే, మన గ్యాసొలిన్ డబ్బాలూ, తుపాకి మందు పీపాలూ, శత్రువులకు అమ్మేసి, వాళ్ళలో చేరిపోయేరు. మనకి గ్యాసొలినుకు బదులుగా నీళ్లూ, తుపాకిమందుకు బదులుగా యిసకా,

మన ట్రెయిన్‌లో పెట్టేరు. ముక్డెన్ సైన్యాలతో చేరి, మన ఆఫీసర్లేమన్ని దగా చేసేరు...

ఈలా చెపుతూ, ఆతడు మా దగ్గర సెలవు తీసుకుని పట్టణం వైపుకి పోయేడు. పెడదయైన ఆతని వీపును చూస్తూనేవున్నాము. అంతలోనే సిపాయిల గుంపుల్లో కనుమరుగై పోయేడు. భయంకరమూ, నిరర్థకమూ, సంహారమూ ఐన యీ జనసమూహాలు గోలచేస్తూ, ఇటూ అటూ పరుగెత్తుతూంటే, నిశ్చేష్టులమై, 'లో-యాంగ్' నగరాన్ని చూస్తూ, నిలబడి పోయేము.

జూన్ 2, 1927, లో-యాన్,
హోనాన్ రాష్ట్రం, చీనా.

# ధర్మసందేహం.

పచ్చటి నురగలు గ్రక్కుతూ బురదనీరు నం కరగా వున్న గట్ల మధ్యనుంచి వేగంగా ప్రవహించి పోతూంది. చిటచిట లాడుతూ వున్నట్లున్న ఆకాశం తెల్లటి మేఘమాలికలతో చాందినీ దింపేసింది. నది పొడుగునా వున్న రేవుల్లో ప్రత్తి బేళ్ళు దింపుతూ, పడవలు పోతూన్నాయి.

రోడ్డు బురదగా వుంది. బండిగాళ్ళలో నీళ్ళు నిలిచి చెదిరి నడిచేవాళ్ళ బట్టల్ని పాడుచేస్తూన్నాయి. అర్ధనగ్నులై వున్న కూలీలు వీపుల మీద ప్రత్తి బేళ్ళు మోస్తూ, సగం క్రుంగి శల్యాకృతులతో, వరుసలుగా నడిచి పోతూన్నారు. వీళ్ళతో సమానంగా పడవ కళాసులు, ప్రత్తి బేళ్ళు మోస్తూ, ఊతగా,

యీాల పాటలు పాడుతున్నారు.

"ఓ- హూో- హూో! ఏ- హే- హేం!

ఈ- హీ- హీ!

బేళ్ళు నెత్తి కెత్తుకుని, 'వార్ఫు' మీాదుగా మోసుకొచ్చి రోడ్డు చివర వున్న ఫ్యాక్టరీలో పడేస్తు న్నారు. ఎర్రటి యిటికలతో కట్టిన యీా ఫ్యాక్టరీ, పెద్ద భూతంలాగ కనిపిస్తూంది. పైన చారల జండా ఒకటి నల్లటి పొగ మధ్య మెల్లిగా ఎగురుతూంది. చి న్న చిన్న పిల్లలు వీపుల మీాద వెదురుబుట్టలు వేలా డేసుకుని రోడ్డు మీాద పడివున్న దూదిపింజల్ని ఏరు తూన్నారు. పాపం! ఆ ఫ్యాక్టరీ ఆకలి తీర్చడానికి, అమాయికులయిన పిల్లలు మొత్తమంది పనిచేసినా చాలిమి ఎక్కడుంది? మధ్యాహ్నం కావచ్చింది. ఎం డ నిప్పులు చెరుగుతూండి. పనులు చేసి చేసి, అలసి పోయిన పడవ కళాసులు, రోడ్డు ప్రక్కల్ని చెట్ల క్రింద కూలబడ్డారు. పదహారు గంటల నుంచి పని చేస్తూన్నారేమో, వాళ్ళ శరీరాలు చెమటతో త డిసి, ముద్ద అయిపోయేయి. చెమటతో తడిసివున్న

బనియనులు తీసి, పిండుకుంటూ, ఫ్యాక్టరీ గేటులోకి ఒకటే ప్రవాహంగా పోతూన్న ప్రతి బేళ్ళ వైపు వెర్రిచూపులు చూస్తూన్నారు. రంగం అంతా కేకలూ, మూలుగులూ, ఒగర్పులూ. విధీవిరామం లేకుండా ఒకటే పాట పాడుతూ, పసువుల కన్నా అధమంగా శ్రమపడుతూన్న కూలీల అవస్థలు చూడ్డానికీ, వినడానికీ, బాధ కలిగిస్తూన్నాయి.

"ఓహూహూ! ఏహేహే! ఆహాహ్హే!! ఈహీహీ!!!"

రోడ్డుకు రెండు ప్రక్కలా, మట్టితో కట్టిన చిన్న చిన్న గుడిసెలు వందలకొలదీ, కిక్కిరిసి వున్నాయి. ఈ మురికి కూపాలే కూలీలకు మేడలూ, మిద్దెలూను. ఒక్కొక్క గుడిసెలో మూడు నాలుగు కుటుంబాలు కాలక్షేపం చేస్తూంటాయి. తూర్పు వర్షాలు కురిసే రోజుల్లో యీ గుడిసెలన్నీ తడిసి, నాని, కూలిపోయి, మొలలోతు నీళ్ళలో వుంటాయి. వరదల రోజుల్లో ఎన్నో గుడిసెలు ఆనవాలు కూడా లేకుండా కొట్టుకుపోతాయి. వరదలు కొంచెం తగ్గగానే మోకాల్లోతు ఊబిలో మళ్ళీ కూలీల కుటుం

బాలన్నీ ఆనవాలైనా కనిపించకుండా, చిందరవంద రగావున్న యీ చెమ్మగుడిసెల్లోకి చేరుకుంటాయి. పాపం! రోజుకు రెండుపూట్లా పట్టెడన్నమైనా లేని కుటుంబాలు, ఇవన్నీ. ఆకలితో యేడ్చి యేడ్చి, పొట్టలుబ్బి, సొమ్మసిల్లిపోయి పడివున్న పిల్లలకు రోజుకు ఒక్కసారి ఇంత గంజి కాచిపోయడమే గగనం. లోతుకు పోయిన కళ్ళూ, వంగి పోయిన నడుమూ, కృంగి కృశించిన శరీరాలూ, బట్టతలలూ,- వాళ్ళూ, ముసలమ్మలను చూసినవాళ్ళకి మృత్యుదేవత వెక్కిరిస్తూన్నట్లే తోస్తుంది. ఈ కుటుంబాలకన్నిటికీ ఏటి పొడుగునా ఏదో ఒకటే అన్నాధరువు. బీటుకుంపల తోనో, కేబేజీతోనో, చేసిన పులుసూ, వరి అన్నం; దేవతాప్రీతికై కాకితపు వత్తులెన్ని వెలిగించి పెడుతున్నా, ఆ దేవతకు పాపం, యీ నిరుపేద కష్టజీవులలో ఒక్కరి మీదా అనుగ్రహం కలిగినట్టే కనిపించదు. కూలీల పేటలోని వీధులన్నీ సన్నంగానూ, వంకర టింకరగానూ వున్నాయి. ఎక్కడ చూసినా పేడతోటీ, చెత్తతోటీ, నానా అసహ్యంగానూ వు

న్నాయి. బక్కచిక్కిన పిల్లలు నగ్నరూపాలతో బురదవీథుల్లోనూ, పెంటకుప్పల మీదా, ఆడుకుంటూ గంతులేస్తూన్నారు. వీథుల్లో పారేసిన ఆహారపదార్థాల్ని కుక్కలతో పోట్లాడి, లాక్కుని తింటూండే వీళ్ళకు రోజులు అదోలా గడిచిపోతూనేవుంటాయి. అడపా దడపా ఎవరైనా కొత్తవాళ్ళు రోడ్డుమీద పోతుంటే, వాళ్ళ వెనక పడి దీనంగా యేడుస్తూ, కానీ, పగాణీ, అడుక్కుంటూంటారు. పాంథుల వెంట వీళ్ళు గుంపులు గుంపులుగా వచ్చి,-

"టా- జన్, కై-షో! టా-జన్, కై-షో!" [ బాబయ్యా! ఇప్పించండి! ] అనో, లేక "టూ-అ, టూ-ప" అనే ముష్టిపాటనో పాడుతూ, చుట్టూరుంటారు. అబ్బా! హృదయం అంటూ వుంటే కరిగి, నీరైపోవలసిన దృష్టాలివి. కాని స్వార్థపరత్వం, మన సమాజంలో మానవత్వాన్నే రూపుమాపినప్పుడు?

కూలీల గుడిసెల్ని తాసుకునేవుంది, జపాన్ వాళ్ళ బట్టలమిల్లు. కూలీల గుడిసెల్లోనుంచి వచ్చే పిల్లల్ని యేమాత్రం, మిల్లులోకి ప్రతిరోజు బేళ్లు మోసే కళా

సులు వేసే "ఏలేసా-బేలేసా" అనే కేకలూ మధ్య
గా కలుసుకుని, వింతశృతిలో పడుతున్నాయి.

ఈ ఆలాపన ఫ్యాక్టరీ గోడల్లోంచి ప్రతిధ్వ
నిస్తూంది. మిల్లులోపల దారపుకదుళ్ళు 'బజ్'మని
ధ్వనిస్తూ తిరుగుతున్నాయి. చక్రాల మీద బెల్టులు
"ఛస్" మంటూ, అతివేగంగా తిరుగుతున్నాయి.
ఈలలు వేస్తూ, ఆవిరి యింజన్‌లు "బస్" మంటు
న్నాయి. ఫ్యాక్టరీలోనుంచి ఈ శబ్దాలూ, బయట
నుంచి ఆ శబ్దాలూ కలిసి శ్రుతి మించి రాగానపడు
తున్నాయి. కూలీల శాశ్వతబానిసత్వం, దుర్భరదా
రిద్ర్యం, యంత్రాల బ్రహ్మాండశక్తి, పెట్టుబడిదారుల
అత్యాశా,- వీటిని గురించే ఆ రాగం ఆలాపించబ
డిందా! అనేటట్లు మాకు తోచింది.

జట్టలమిల్లుకు సమీపంలోనే వున్న వార్ఫు
మీద కూర్చుని రేవునావ కోసం యెదురుచూస్తూ
న్నాము. రేవుదాటితే యూరోపియన్‌ల మకాము
లున్నాయి. మైత్రీ- హాూ-సిన్, మా దగ్గర కూర్చుని
పూర్వవృత్తాంతాన్ని యేకరువు పెడుతున్నాడు.

మా వెనకనుంచి కూలీపేటలోని రణగుణ ధ్వనీ, ముందునుంచి ఫ్యాక్టరీ హోరూ సమ్మేళనమై శైన- హెూ- సిన్ నిష్కపట గాధకు శ్రుతి వేస్తూన్నాయి.

"......నాస్వగ్రామం ఇక్కడికి నాలుగువందల "లీ"లు దూరంలో వుంది. నదిమీద యెగువగా పోవాలి. మాప్రాంతాల్లో నీటిసదుపాయా లంతగా లేకపోవడంవల్ల వరిపంట బాగా పండదు. పూచాన్, షాంఘై నగరాల్లో పెద్దపెద్ద మిల్లులూ, ఫ్యాక్టరీలూ బయలుదేరడంతోనే మా ప్రాంతాలలోని రైతులంతా ప్రత్తిపంటనే వేయసాగేరు. నా చిన్నతనంలోనే మా వూరంతా ప్రత్తిచేలతో నిండిపోయి వుండేది. ఆకురాలే కాలంలో ప్రత్తికాయలు పక్వమై, విడిపోయి, తెల్లటి దూది పైకివచ్చినప్పుడు ఎక్కడా ఆకు లేనా కనుపించీవికావు. చేలన్నీ తెల్లగా పిండి ఆరబోసినట్టుగా వుండేవి.

మా గ్రామపెద్ద శైన. మావూళ్ళో భూమి చాలమట్టుకు ఆతనిదే. ఆతని దగ్గరబంధువులవే మిగిలినకొద్ది

భూములు కూడా. పైన ఎప్పుడూ రాజధానీ నగరం లోనే వుంటాడు. అక్కడి పెద్దపెద్దవర్తకులలో అత డొకడు. భూములన్నీ రైతులకు అమర్చుకొని, ఆతడు పట్టణంలో వ్యాపారం చేసుకుంటూండేవాడు.

నాచిన్నతనంలో నేనూ, అమ్మాకూడా మా మేనమామగారింట్లో వుండేవాళ్ళము. ఆతడి షాపులోనే చాకిరీ చేస్తూంటే, మాకు ఆతడే కూడు గుడ్డలిచ్చి పోషిస్తుండేవాడు. మా నాయన పడవ కళాసుగా వుండేవాడు. నదిపొడుగునా వర్తకుల ప్రత్తి బేళ్ళూ, యితర సరుకులూ వేసుకొని ఒక వూరు నుంచి నుకో వూరికి తిరుగుతుండేవాడు. ఎల్లాగైనా కొంచెం డబ్బు కూడబెట్టుకొని రెండెకరాల నేల సంపాదించుకుని, స్వంతగుడిసె కట్టుకొని, కుటుంబంతో అక్కడస్థిరపడదామని నాతండ్రి దివాస్వప్నాలు కంటూండేవాడు. కానీ, దురదృష్టదేవత మమ్మల్ని యెప్పుడూ వెంటాడిస్తూనే వుండేది. అతనికి పని దొరకక్క పోవడమో, మా కొంపాగోడీ పరశు రామప్రీతి అవడమో, ప్రత్తిబేళ్ళు మోసేటప్పుడు

కాలు జెణికి, కదల్లేక మూడు నాలుగు నెలలు మూల పడుండడమో, ఏదో ఒకటి సంభవిస్తూనే వుండేది.

నాకు పదిహేనేళ్ళు వచ్చేసరికి మా కుటుంబానికి పెద్ద దెబ్బతగిలింది. ఆరోజుల్లో కలరా వ్యాధి వ్యాపించి, దేశంఅంతా పురుగునాకేసింది. మాఅమ్మను కూడా కలరా పొట్టని బెట్టుకుంది. నాకింకా యీడురాని కారణంచేత అంతగా పనిపాటలు చేయలేనని, మా మామ నన్ను పోషించడానికి అంగీకరించలేదు. ఇంక చేసేదేమీ లేక మా నాన్న నన్ను తీసుకుని పట్నానికివచ్చేడు.

ఇదుగో! యీ వార్ఫు మీదే మేము పడవ దిగేము. ఎనిమిదేళ్ళు కావచ్చిందప్పుడే. మా ప్రాంతాలవాళ్ళెందరో బట్టలమిల్లులో పనిచేస్తున్నారు. వాళ్ళ ద్వారా నాకుకూడా మిల్లులో పని సంపాదించాలని మాతండ్రి యత్నించేడు. అదుగో, ఆ కనిపించే హొటల్లోనే మా బంధువు లందరికీ అప్పుడు చిన్న విందు చేసేడు, నాన్న. మా బంధువులందరినీ పిలిచేడు. ఒకొక్కరే వచ్చి చేరినతర్వాత విందు ప్రారంభ మైనది.

గ్లాసు మీద గ్లాసు, ధాన్యపు సారాయి అతిథుల కడుపుల్లోకి ఖాళీ ఐపోయింది. ఇరవయ్యేళ్ళకప్పు ఖాళీ అయేటప్పటికి నాఅదృష్టం నిర్ణయించబడిపోయింది. మాయింటి పేరటివాడే, సైసె- టా- చో అనే మా దూరబంధువు ఇక్కడి ఫ్యాక్టరీలో మెకానిక్ గా పని చేస్తూ న్నాడు. ఆతడు నన్ను తనక్రింద అసిస్టెంటుగా తీసుకుంటా నన్నాడు.

ఇదిజరిగిన కొద్దిరోజులలోనే మా తండ్రి పడవమీద నదిలో మెగువకు సరుకు తీసుకు వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు నాకు బుద్ధులు చెప్పి మరీ వది లేదు. సైసె- టా- చో మాటవింటూ, జాగ్రత్తగా వుండమనీ, కష్టపడి పని నేర్చుకొమ్మనీ, ఎవరితోనూ పోట్లాటలు పెట్టుకోవద్దనీ, యింకా ఎన్నో నీతులు చెప్పి మా కులపెద్ద 'సైసె' దగ్గరకు తీసుకువెళ్ళేడు. ఆతడు ధనవంతుడు, వర్తకుడు. మమ్మల్ని చూడ్డానికి తీరుబడే లేకపోయిందాతనికి. మా కాతని దర్శనం దొరకక పోయినా, నాన్న కొంత డబ్బు మూట గట్టి, కులపెద్దల స్మారకార్థంగా కట్టుతూన్న దేవాల

యానికై సమర్పించి లేచివచ్చేను. "కలిపోసినా ఉట్టి వంకే చూసేడ" న్నట్లుగా 'శైన' మాకు దర్శనమేనా ఇవ్వకపోయినా, ఏదైనా ఆపత్సమయంలో ఆతడిద ర్శనం చేసి, సహాయం కోరమని మా నాన్న చెప్పే డు. "శైన, మన కులపెద్ద; రక్షకుడు; ఆపత్సమయా లలో ఆతడే మనకు దిక్కు," అంటూ మా నాన్న, నన్ను వదలలేక వదలి వెళ్ళిపోయేడు.

మా తండ్రి పూర్వకాలపు మనిషి. కుటుంబ బాంధవ్యము లతిపవిత్రములనీ, వీటిని జాగ్రత్తగా కాపాడుకుంటూ వుండాలనీ నమ్మతూ, నన్నుకూడా పూర్వ సాంప్రదాయాల్లో విశ్వాసంగల వాణ్ణిగా చేయాలని తాపత్రియపడే వాడు. ఇక్కడ పట్టణం లో మా ప్రాంతీయుల సంఘం ఒకటుంది. అందులో పలుకుబడి గల పెద్దల ప్రాపకం సంపాదిస్తే, యింకెం దుకూ భయపడవలసిన పనిలేదని మా తండ్రి నాకె ప్పుడూ హితవు చెపుతూండేవాడు.

అదే మా తండ్రిని నేను కడపటిసారి చూడ డం. నదిమీద తరచుగా ప్రమాదాలు తటస్థిస్తూనే

వుంటవి. అదే మా తండ్రిని మింగివేసింది. ఒకనాటి రాత్రి కటికి చీకట్లో, విదేశీయుల నౌక ఒకటి మా తండ్రి వాళ్ళున్న పడవను ఢీకొని ముంచేసింది. పడవ కళాసులలో కేవలం ఒక్కడు మాత్రమే బ్రతికేడు. పడవ దెబ్బ తినగానే, పడవ మీది వాళ్ళంతా ధంకాలు మోగించీ, తారాజువ్వల్ని వదిలీ, ఎన్నో పాట్లు పడ్డారుట. కాని యీ అపాయచిహ్నాల్ని లక్ష్యపెట్టకుండా ఆ విదేశీయుల నౌక వెళ్ళిపోయింది. పడవలో వాళ్ళకు సహాయం చేసేవాళ్ళెవరూ లేక పోయేరుట. వాళ్ళ శవాలుకూడ దొరకలేదు. అందుచేత మృతసంస్కారాలు కూడా చేయడానికి వీలు లేక పోయింది. మా తండ్రి సమాధి మీద గుప్పెడు మన్ను వేసి, ఋణం తీర్చుకోజాలక పోయేను! ఈ కఠోరవిశాలప్రపంచంలో యేకాకిగా మిగిలిపోయేను. నా రెక్కలే నాకు ఆధారం.

ఫ్యాక్టరీలో మెకానిష్టు 'బ్రైస' క్రింద నేను పని నేర్చుకుంటూ వుండిపోయేను. ఇంజనులు తుడవడం, నూనె పోయడం, నా పనులు. సాయంత్రం 6

గంటలు లగాయితు ఉదయం 6 గంటలవరకూ మా వంతు. అప్పటికి పగటి జట్టువాళ్ళు వస్తూండే వాళ్ళు. ఇంజన్ గది వేడిగాను, ఉక్కగాను ఉండేది. కానీ ఆ పరిస్థితులకు క్రమంగా అలవాటు పడిపోయేను. నా తెలివి తేటలకీ, నేర్పుకీ, క్సై-టా-చో చాలా సంతోషించేవాడు. ప్రతీవిషయంలోనూ అతనికి సహాయంగా వుంటూండేవాడిని. అతనికే గాక మా యింజన్ గది చూడ్డానికి తరచుగా వచ్చే జపాన్ ఓవర్ సీయర్ కు కూడా అభిమాన పాత్రుడనయేను, కొద్ది రోజులలోనే.

క్సై-టా-చో ధర్మమాయని, నేను మంచి పనిలోనే పడ్డానని గ్రహించుకున్నాను. ప్రత్తి బాగు చేసే పనిలోనూ, స్పిన్నింగు శాఖలోను, వీవింగ్ [నేతపని] శాఖలోనూ పనిచేసే కుర్రాళ్ళనీ, ఆడపిల్లల్నీ బట్టిచూస్తే నా పని చాలా మెరుగు. నాకు వచ్చే జీతమంతా నా తిండికీ,బట్టలకీ తీసుకుంటూండేవాడు, క్సై టా-చో. అసలు నాకు జీతమెంతో కూడా తెలియదు. కాని, కొద్ది రోజుల్లోనే మెకానిక్ గా

తరిఫీదుపొంది, రోజు కొక డాలరుజీతం తీసుకుంటూ, మెకానిక్స్ ట్రేడ్ యూనియన్‌లో సభ్యుణ్ణవుతాన ని, అందరూ అంటూండే వాళ్ళు.

కాలక్రమేణా నేను మెకానిక్ నవుతాను. ఈ వూహతో నాలో కొంచెం గర్వం కలిగింది కూలీలం దర్నీ కొంచెం చిన్న చూపు చూడ నారంభించేను. సామాన్య కూలీలకు దూరంగా వుండడం, మేస్త్రీలు, ఫోర్మన్ లూ, జపాన్ ఓవర్ సీయర్లూ, వీళ్ళతో క లసి వుంటూండడం, కూడా ప్రారంభమయింది.

ఫ్యాక్టరీలో నేను చేరి ఒకసంవత్సరం కావ చ్చింది, అప్పటికి. ఒకరోజున యిద్దరు నేతపనివాళ్ళు మా యింజన్ హాలులోనికి ఏదో పనిమీద వచ్చేరు. ఎల్లావచ్చిందో తెలియదుగాని వాళ్ళిద్దరికీ పేచీవచ్చి పోట్లాట ప్రారంభించేరు. సైన్- టా- చో, జపాన్ ఓవర్ సీయర్ ను తీసుకురమ్మని, నన్ను పంపేరు. నేను వెళ్ళి ఆఫీసు గదిలో వున్న ఓవర్ సీయర్ ను మా సెక్షన్‌కు వెంటబెట్టుకొని వచ్చేను. పోట్లాడు కుంటూన్న కార్మికుల్ని రెండు కొరడా దెబ్బలతో

విడదీసి, వాళ్ళిద్దరి నెంబరులూ, పేర్లూ పుస్తకములో రాసుకొంటూన్నాడు, జసాన్ వాడు. సైసె-టా-చో వాడి దగ్గరకు వెళ్ళి యేదో గుసగుసలాడేడు. దాంతో ఓవర్‌సీయర్, మా దేశస్థుడి నెంబరు గీతపెట్టి, రెండో కూలీని బయటకు వెళ్ళిపొమ్మన్నాడు.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఈ పేచీని ప్రారంభించినవాడు మా దేశంవాడేనని నాకు బాగా తెలుసు. ఆ రెండో నేతపనివాడు పాపం, అమాయకుడు! వయస్సు కూడా ఎంతో వుండదు. కానీ, పైకి నే నేమీ అనలేదు. పనిలోంచి తీసేసిన తర్వాత ఆతడింకేమీ పని దొరక్క యెంతో బాధ పడుతూండేవాడు. తెల్లవారేసరికి వాడు ఫ్యాక్టరీ గేటు దగ్గరకు రావడం, కాపలావాళ్ళు కర్రలతో, వానిని దూరంగా తరిమి కొట్టడం, యిది నిత్యకృత్యమై పోయింది. కొద్ది రోజుల్లోనే ఆతడు బక్కచిక్కిపోయేడు. ఆతని బట్టలు చిరిగి, పీలికలైపోయేయి. నిరుద్యోగు లందరితో బాటు ఆతడూ రాత్రిలన్నీ ఫ్యాక్టరీ గోడల ప్రక్కనే గడిపేవాడు. పాపం! ఆతన్ని చూసినప్పుడల్లా

నేనేదో అపరాధం చేసినట్టుగా నా అంతరాత్మ పీడిం చేవి. అది శీతకాలం. ఓ రోజున రాత్రంతా పనిచేసి, ప్రాతఃకాలాన్నే బయటకు వస్తూన్నాము. ఫ్యాక్టరీగే టు ముందుగా వున్న చెట్టుకు వురిపోసుకుని, ఆయువ కుడు చచ్చి వ్రేలాడుతూన్నాడు. ఆతని చావు నాకొ కి పెద్ద ఆఘాతంగా తగిలింది. నా చేసిన తప్పు తెలు సుకొని పశ్చాత్తాప పడేవాడినే, కాని యితర కూలీ లంతా ఆతడి చావుకు నేనే కారణమని నన్ను నిందిం చుతూండడంతోటి, నాలో అహంభావం హెచ్చిపో యింది. నా పొరబాటు నే నొప్పుకోలేక పోయేను. కూలీలంతా నన్ను చూసి ఓవర్సీయర్‌కు పెంపుడు కుక్కనీ, యింకా నీచమైన పేరులుపెట్టీ నన్ను వేళా కోళాలు ప్రారంభించేరు. దాంతో నేను కూలీలకు మరీ దూరంగా వుండడం ఆరంభించేను.

“ఈ విధంగా మూడేళ్ళు గడిచిపోయేయి. నా అప్రెంటిస్‌పని యించు మించుగా పూర్తి కావ చ్చింది. ఇంజన్ల వ్యవహారమంతా అప్పుడప్పుడు నేనే స్వయంగా చూసుకుంటున్నాను. ఇంజన్‌రూమ్‌లో

ఓమూల కైస్టీటా చో కునికిపాట్లు పడుతూకూ ర్చుండేవాడు. నేను యింజనులు నడుపుతూ వుండే వాడిని. నా బంధువుడి సహాయం వల్లా, నా వినయ విధేయతల వల్లా, కష్టపడి పనిచేసి, యీ విశాలప్రపంచంలో నాకు కూడా ఒకస్థానాన్ని నిర్మించుకునే అవకాశాలు కలిగేయని తృప్తి పడేవాడిని. ఇంతలో కే కథ అడ్డం తిరుగుతుందని యెవరూహించేరు? ఒక విపరీత సంఘటన నా భావాల్నీ అలవాట్లనీ కూడా పూర్తిగా మార్చేసింది.

"ఆ సంవత్సరం అనావృష్టివల్ల పంటలు నాశనం ఐపోయాయి. అంతా కరువుగా వుంది. ధాన్యాంధర పెరిగిపోయింది. రోజురోజుకూ ప్రతిఫల మందం ఐపోతూంది. ఎందరో రైతులూ, ఆడవాళ్ళూ, పిల్లలూ కూడా పనులు దొరక్క, తిండిలేక మలమలా మాడిపోయి, పట్టణాలకు చేరుకున్నారు. ఏమిల్లులోనో, లేక ఫ్యాక్టరీలోనో, పనులు దొరుకుతాయని పాపం, వాళ్ళ ఆశ! రాత్రిలంతా ఫ్యాక్టరీ గేట్లప్రక్క గుంపులు గుంపులుగా, నిలుచునే గడిపే వాళ్ళు.

ఏవో నాలుగుడబ్బులు గడించుకొని, సంవత్సరాది నాటికి యేలాగైనా యీనాందార్లకి శిస్తులు చెల్లి పెడదామని వాళ్ళ ఉద్దేశ్యం. కాని, ప్రత్తిధర పడిపోవడం మూలాన మిల్లులో అదివరకున్న పనివాళ్ళనే తీసేస్తూన్నారు. అలాంటప్పుడు కొత్త పనులు యేలా దొరుకుతాయో చెప్పండి? ఎందరోకూలీలు బికారీలూ, ముష్టివాళ్ళూ అయిపోతూన్నారు. జీతాలు తగ్గించేరు. ధాన్యం ధర పెరిగిపోయింది. కూలీల్లో అసంతృప్తీ, చిరాకూ పెచ్చు పెరిగి పోతూంది.

"పని చేస్తూండే వేళల్లో, అప్పుడప్పుడు నేను స్పిన్నింగుశాఖలోకి వెడుతూ వుండేవాడిని. పనికిరాని దారపుచిక్కు తెచ్చుకుని, యింజనులు తుడుచుకునేందుకు వుపయోగించే వాళ్ళం. ఆ రోజున తెల్లవారవస్తూంది. మా పనులు కట్టిపెట్టే వేళ కావచ్చింది. ఆ సమయంలో నేను స్పిన్నింగు డిపార్టుమెంటులోకి ఏదో పని మీద వెళ్ళేను. ఎలక్ట్రిక్ దీపాలు కూడా మబ్బుగా వెలుగుతున్నాయి. ప్రత్తిలోంచి యెగిరే దుమ్మూ, ధూళీ, అంతా గాలిలో వ్యాపించడం చేత

మరింత మసకగా వుంది. ఆ హాలులో చెమట వాసన భరించడానికి శక్యం గాకుండా వుంది.

"ఈ సెక్షనులో పనిచేసే వాళ్ళందరూ,— చిన్నపిల్లలూ, ఆడాళ్ళూ, మగవాళ్ళూ, ఒక్కొక్క మిషన్ ముందు వాళ్ళవాళ్ళ యెత్తులకు సరిపడేలా అమర్చిన కదుళ్ళ దగ్గర నిలుచుని పనిచేస్తూన్నారు. దారాలు తెగిపోయినప్పుడల్లా వాటిని జాగ్రత్తగా పట్టుకొని, ముడిపెట్టడం, వాళ్ళు చేయవలసిన పని. ఏమాత్రమూ, అజాగ్రత్తగా వుండడానికి లేదు. మెషీనులన్నీ విసుగూ విరామం లేకుండా గిర్రున తిరుగుతూ, మురికిగావున్న దూదినంతా యేకి, సన్నటి యేకుగా తయారు చేస్తూన్నాయి. మెషినులక్రిందా, మూలల్లోనూ, ప్రత్తిగుట్టలమీదా ఎందరో పసి పిల్లలు ఆడుకుంటూ, పాకుతూ, నిద్రపోతూ, వున్నారు. మరికొంటిపిల్లలు, వెదురుపేళ్ళ బుట్టలలో పడి నిద్రపోతూన్నారు. ప్రతి వయిపునుంచి పొడిదగ్గు వినిపిస్తూంది. వసారాల్లోంచి కుర్రాళ్ళు యిటూఆటూ దారపుకదుళ్ళుంచిన తట్టలు భారంగా మోస్తూ నడుస్తు

న్నారు. పిల్లలూ, ఆడవాళ్ళూ పన్నెండు గంటలు విరామం లేకుండా పని చేయడంవల్ల ప్రాణాలు చాలొచ్చి, పీనుగుల్లా అయిపోయి, బూడిదకొట్టుకొని న మొహాలతో వున్నారు. మెషీన్‌ల హోరు, కదుళ్ల బజ్ జ్ జ్ శబ్దాలూ, ఉక్కగాను, మసగగాను వున్న ఆ హాలులోని దుర్వాసన,-యివన్నీ నరాల్ని క్రుంగతీసేస్తూంటే, వాళ్ళు సొలిపోన్నారు.

మెషీన్‌లమధ్య నుండే సన్నని యిరుకు త్రోవమ్మటే పోతూన్నా. సన్నటి కొరడా చేతితో పట్టుకొని నా కెదురుగా జపాన్ ఓవర్‌సీయర్ వస్తూ కనిపించేడు. ఓ చోట ఆగి, తెల్లగా పాలిపోయి వున్న పదేళ్ళ కుర్రాడిని పరీక్షగా చూస్తూన్నాడు, వాడు. పిల్లవాడు నిద్రను ఆపుకోలేక, తెగిన దారాల్ని అతుకుపెట్టక జోగిపోతూన్నాడు. నేనూ వెళ్ళి ప్రక్కనే నిలుచున్నాను. ఓవర్‌సీయర్ కొరడా గాలిలో పైకి లేచింది. నాకళ్ళు చీకట్లు క్రమ్మినాయి. ఛళ్ళుమని దెబ్బవినిపించింది. ఆ కుర్రాడు కెవ్వున కేకపెట్టి క్రిందపడిపోయేడు. వాని కేకతో హాలంతా మారుమోగి

గింది. కూలీలందరూ, కంగారుగా తొందరపడుతూ, మా దగ్గర కొచ్చి మూగిపోయేరు.

"ఆ కుర్రాడు నేలమీద బోరగిలా పడిపోయి వున్నాడు. మొహం చేతులతో కప్పుకున్నాడు. ఒక కూలీ, వాడిని పయికి లేవతీసి కూర్చోపెట్టేడు. ఒక స్త్రీ ముందుకు వచ్చి పిల్లవాడి మొహం మీద కారే నెత్తురు బట్టకొంగుతో తుడిచింది. అబ్బా! ఆ దృశ్యం చూడలేక పోయేము.

"పిల్లవాడికి వంటిమీద స్మారకం లేదు. చచ్చి పోయినట్లుగా కొయ్యబారి పడివున్నాడు.

"ఆడకూలీలంతా రోషంతో జపాన్ వాడి మీదికి విరుచుకుపడ్డారు. వాడు పారిపోడానికి యెంతో ప్రయత్నంచేసేడు. కాని మీదపడి కొరడా లాగేశారు, వాళ్ళు. వాడూ పరుగు లంకించుకున్నాడు. నూలు కదుళ్ళు, పింగాణీ పాత్రలూ పుచ్చుకొని కొడుతూ తరుముకు పోతున్నారు, ఆడకూలీలు. జపాన్ వాడు పరుగెత్తుతూనే రివాల్వరు తీసి గుంపుమీదికి కాల్చేడు. హాలులో ఆడవాళ్ళూ, పిల్లలూ,— అం

దరూ పనులు మానేసి మధ్యకు పోగయేరు. చాల మంది ఆడకూలీలు, యితర డిపార్టుమెంటుల్లోకి పరుగెత్తుతూ పోయారు.

"పని మానేయండి! వెంటనే మానేయాలి"

"ఇదంతా చూసేక నాకు ఉద్రేకంతో ఒళ్ళు తెలియలేదు. ఇంజన్ హాలులోకి పరుగెత్తు కుంటూ పోయేను. సైస్-టా-చో యింజన్ దగ్గర నిలుచుని వున్నాడు. ఆతడ్ని ప్రక్కకు గెంటేసి, 'ఆలారమ్ విజిల్' మరనులాగేస్తూ, కాపర్ లివర్ని వదలిపెట్టి యింజన్‌లను ఆపేసేను. టార్బిన్ని మిషన్ బెల్టులూ, మెషీన్‌లూ క్రమంగా వేగం తగ్గి తిరుగుతూ, పటపట కొట్టుకుని ఆగిపోతున్నాయి. సైస్-టా-చో మొట్ట మొదట్లో నిశ్చేష్టుడై, విస్తుబోయి చూస్తూ, నిల్చుని పోయేడు. గుడ్లు మిఋకరించి వెర్రివాడిలాగ నా కేసి చూసి చూసి తటాలున స్మారకంలోకి వచ్చేడు. నా దగ్గరకొచ్చి జబ్బపట్టుకొని యింజన్ దగ్గర నుంచి లాగటం ప్రారంభించేడు. నేనువానితో పెనుగులాడడంతో, సైస్-టా-చో తటాలున నా కంఠం

పట్టుకుని నొక్కడం ఆరంభించేడు. ఉక్కిరి బిక్కిరై పోతూనే నేను మోకాలుతో వాడిడొక్కలో ఒక్క పోటు పొడిచి క్రిందికితోస్తూ, వాడిచేతులు విడిపించేసుకున్నాను. కొంచెంసర్దుకుని మళ్ళీ నా మీదికి విరుచుకుపడ్డాడు. ఆక్షణంలోనే యింజన్ దగ్గరగా వున్న యెత్తుపీటను పైకెత్తి నా బలంకొద్దీ వాడి నెత్తి మీద విసిరికొట్టేను. సైన్-టూ-, చో, వెనక్కి తూలుతూపోయి, ఓ ప్రక్కగావున్న బొగ్గుల గుట్ట మీద స్మృతితప్పి చాపచుట్టుగా పడిపోయేడు.

"సరిగా ఆ సమయంలోనే నా వెనకవైపు నుంచి ఎవరో కాని కేకేసేరు. "సెభాస్, మంచిపని చేసేవోయ్, కామ్రేడ్!"

"నేనూ వెనకతిరిగి చూసేసరికి, పగటిపూట పనిచేసే యింజనీయర్ కనిపించేడు. మమ్మల్ని ఆతడు "రిలీవు" చేయడానికి వచ్చి జపాన్ ఓవర్ సీయరుతోటి పోట్లాట, సైన్-టూ- చో ను నేను పడగొట్టడమూ, చూసివుంటాడు.

"ఇంజనీర్ గబగబా వచ్చి, నన్ను దరగ్గరకు

తీసుకుని, ఎంతో అభినందించేడు. తన అసిస్టెంటును కేకలువేసి పిలిచి, ఫ్యాక్టరీ ముంగిట్లోకి పరుగెత్తుకు పోయేడు. నేనూ అతడి వెనకే పరుగెత్తుకు పోయేను. అప్పటికప్పుడే చాలమంది కూలీలూ, ఆడవాళ్ళూ, పిల్లలూ పనులు కట్టిపెట్టి, అక్కడికి చేరేరు. పిల్లలు ఒకటే ఏడుపు. తల్లుల్ని అంటిపెట్టుకుని పసిబిడ్డలు ఒకటే గోల చేస్తూన్నారు. ఎక్కడ చూసినా జపానువాళ్ళని తిట్టేవాళ్ళే. మొగాళ్ళంతా ఒకరితో ఒకరు గుసగుసలాడుతూ ఉద్రేకంతో తిరుగుతున్నారు. పగటిపూట రావలసిన కూలీలంతా అప్పటికే వచ్చి పడ్డారు. పనులు దొరకక తిరుగుతూన్న రైతులూ, కళాసులూ మాతో చేరిపోయేరు. వాకిట్లో ఒకటే జనసమూహం. ఇసకవేసినా రాలకుండా పోగయేరు.

"పగటి యింజనీయర్ "పాంగ్" గుంపులోనుంచి దారిచేసుకుంటూ జనంమధ్యకువెళ్ళి అక్కడవున్న పత్తిబేలు మీదకు యెక్కి ఉపన్యాసం ప్రారంభించేడు. జపాన్ ఓవర్‌సీర్ల అక్రమ పశుప్రవర్తనను గూర్చి, అమానుష పద్ధతుల మీద కూలీలచేత బండ

చాకిరీ చేయించడాన్ని గూర్చీ, పన్నెండు గంటలు చెమటోడ్చి పనిచేసినా కడుపు నింపుకోలేని కార్మి కుల దురవస్థల్ని గూర్చీ, మనస్సులు కరిగేలా చెప్పే డు. కార్మికుల కోరికల్ని గురించి ఆలోచించి, ఒక స్టేటుమెంటు తయారు చేయాలనీ, మన కోరికలు తీ ర్చేవరకూ ఒక్క కూలీకూడా వెనుకంజ వేయకుండా పోరాడాలనీ, హెచ్చరించేడు.

"మీటింగు మాంచి వేడిమీద వుంది. ఆలాం టిసమయంలో నూటయేభై మంది జపాన్ నావికులు ఫ్యాక్టరీ ఆవరణలోకి చొరుచుకుంటూ వచ్చి పడ్డారు. ఫ్యాక్టరీ అధికారులు వాళ్ళని పిలిపించేరు. వాళ్ళూ వచ్చి గేటు తలుపులు మూసివేసి నాలుగువయిపులా కాపలా దార్లను నిలువబెట్టేరు. ఆఫీసరు ముందుకు వచ్చి కూలీలందర్ని అక్కడినుంచి వెళ్ళిపొమ్మనీ, యెవరి పనులలో వాళ్ళు వుండాలనీ ఆజ్ఞ యిచ్చేడు.

"ఇంజనీర్ 'పాంగ్' కూలీల వైపు తిరిగి "మీ మీ స్థలాలకు వెళ్ళండి. ఎవరూ పనులు ప్రారంభిం చవద్దు. మీరు ఎన్నుకున్న ప్రతినిధుల దగ్గరనుంచి

కి బురు వచ్చేదాకా పని ముట్టుకోకండి" అన్నాడు.

"గుంపంతా చెదిరి, ఎవరి స్థానాలకు వాళ్ళు వెళ్ళిపోతూన్నారు. నేనూ యింజన్ రూముకు వెళ్ళిపోయేను.

"మరికొంచెం సేపటిలోనే, ఫ్యాక్టరీలోనుంచి కూలీలనందర్నీ వెళ్ళగొట్టమనీ, ప్రతివాడి నెంబర్నీ లాక్కోమనీ, ఆఫీసరు నావికులకు ఆజ్ఞలిచ్చేడు. ఒక హాలు తర్వాత యింకో హాలు చొప్పున వాళ్ళు ఖాళీ చేయ నారంభించేరు. ఏదో అపాయం జరుగుతుందని గ్రహించి ఆడకూలీలు పారిపోవాలని యత్నించేరు కాని అన్ని ద్వారాలవద్దా కాపలా వుంది.

"నావికులు ఓవర్‌సీయర్లను వెంటబెట్టుకొని కార్మికుల్ని గుంపులుగుంపులుగా వసారాల్లోకి లాక్కొచ్చి రబ్బరు కర్రలతో చావమోది, ఆవరణలోనికీ, అక్కడినుంచి గేటువెలుపలకూ, తరుమ నారంభించేరు. కొద్దిసేపట్లో ఫ్యాక్టరీ ఆవరణలో చాలా మంది కార్మికులు పోగుపడ్డారు. ఫ్యాక్టరీ గేటు దగ్గర కాపలావున్న నావికులు వెంటనే తుపాకులు

బారుచేసి ఒక రౌండు గాలీలోకీ, రెండోది కార్మి కుల మీాదికీ వదిలేరు. నిలుచున్న పళంగా ముగ్గురు కూలీలు చచ్చేరు. ఆరుగురు గాయపడ్డారు.

కూలీల్లో భయం పుట్టింది. ఫ్యాక్టరీలోనుంచి ఆడకూలీలూ, పిల్లలూ గుంపులుగుంపులుగా పరుగె త్తుకుంటూ త్రోసుకొచ్చేసేరు. గేటు తెరుచుకుని, ఏలాగయినా బయటపడి ప్రాణాలు దక్కించుకుం దామని వాళ్ళ ఆతురత. నావికులు వాళ్ళమీాదకు దుమికి సన్నీలతో పొడిచీ, తుపాకీ మడమలతో చావమోదీ, లాఠీలతో బాదీ, తరుమ నారంభించేరు. జపాన్ ఓవర్‌సీయర్లు గేటుమూసేయాలని, ప్రయ త్నించేరు. కాని మేము యెల్లాగో వాళ్ళను త్రోసు కుంటూ, గేటు బారుగా తెరిచేసేము. జనం అంతా రోడ్డుమీాదకు విరుచుకు పడ్డారు. జపాన్ నావికులు మళ్ళీ వెనుకనుంచి తుపాకులు కాల్చేరు. ఇంకో కొం దరికి గాయాలు తగిలేయి.

"ఈవిధంగా ప్రారంభమైంది, మా మొదటి సమ్మె......

చిన్న పడవ ఆవలి గట్టునుండి మమ్మల్ని సమీపిస్తూంది. శ్యై- హూ- సిన్ తన కథను నిలిపేసు.

"మనం పట్టణంలోకి పోవడానికి రేవునావ వచ్చింది. కాని యింకా పావుగంట ఆలస్యము వుంటుంది. రాత్రి వంతు ఓవర్‌సీర్లను తీసుకొచ్చింది, యీ పడవ. పగటివంతు వాళ్ళు దీనిమీదే వెడతారు. వాళ్ళు వచ్చేవరకూ పడవ ఆగుతుంది."

"అదీ బాగానే వుంది. సమ్మెకథ యింకా పూర్తి కాలేదు, కాదా?" అన్నాను నేను.

"సమ్మెనుగురించేనా? ఇంకెంతో లేదు. అయిపో వచ్చింది. సమ్మె చాల రోజులు జరిగింది. అంత కాలము సమ్మె జరగడం, కార్మికులు అంత పట్టుదలతో పోట్లాడడం, అదే మొదలు. చివరకు ఆకలి మంటలే మమ్మల్ని ఫ్యాక్టరీ యజమానుల దగ్గరకు తరిమినాయి. అందరికీ సమ్మె ముగింపు చెయ్యాలనే వుంది. జపాన్ ఫ్యాక్టరీ అధికారులు మా కోరికలు వేటికీ అంగీకరించనే లేదు. కళ్ళు పోయిన ఆ పిల్ల

వాడికి మాత్రం నూరు డాలర్లు పరిహారం యివ్వ డానికి సమ్మతించేరు. అట్టి సమయంలో మా అంద రికీ, ఒక్క వుపాయం తోచింది. మా బంధువు వున్నా డే స్తైన్సు, ఆతడి సహాయం కోరుదామని నిశ్చయించు కున్నాము.

మా ప్రాంతాల వాళ్ళూ, మా బంధువులూ చాలామంది బట్టలమిల్లులో పని చేస్తూన్నారని చె ప్పేను, కాదూ? స్తైన్సు, మా కులపెద్ద. అంతేగాక వయోధికుడూ, పట్టణంలో ఎంతో పలుకుబడి కల వాడూ కూడాను. ఎంతో ధనవంతుడు. అంచేతనే అందరిచేతా గౌరవించ బడుతూంటాడు. పట్టణంలో కల్లా యితడే పెద్దవర్తకుడు. 'జాతీయావమానదినం' ( Day of Shame ) నాడు జపాన్ వస్తుబహిష్కరణ తీవ్రంగా కొనసాగించ బడినపుడు, యీతడు జాతీ యోద్యమానికి ఎంతో ధనసహాయం చేయడమే కాకుండా స్వయంగా సలహాలిస్తూ వుద్యమంలో పాల్గొన్నాడు. అంచేత, మా కేమైనా సహాయము చేయఁకపోడని మాకు తోచింది.

"కూలీల తరఫున అయిదుగురిని ప్రతినిధు లుగా ఎన్నుకున్నాము. అందులో నేనొకణ్ణి. నాక ప్పటికి పందొమ్మిదేళ్ళ వయస్సు. సమ్మెలో నా ప్రవర్తన చూసిన తర్వాత కూలీలకు నా యందుండే భావం మార్పు చెందినదనుకుంటా! మేము అయి దుగురం, సైన్ వద్దకు రాయబారం వెళ్ళేము.

"మొదటినుంచీ యీ రాయబారానికి యిం జనీర్ 'ఫాంగ్' విముఖుడుగానే వున్నాడు. దీనివల్ల, ప్రయోజన మేమీ వుండదని అతడి వాదం. ఫాంగ్ మా కులంవాడు కాడు. మా ప్రాంతీయుడూ కాడు. ఎక్కడో దూరాన్నుంచి వచ్చి పనిచేస్తూన్నాడు. అంచేత అతనికి సైన్ ని గురించి తెలియదు. మేము వెళ్ళడానికే నిశ్చయించుకొన్నాము. సైన్ మమ్మల్ని తన యింటి ముందరి ఉద్యానవనములో కలుసుకు న్నాడు. అతడు మల్బరీ చెట్టు క్రింద కూర్చుని, హుక్కా పీలుస్తూ, ఫౌంటెన్ యొక్క శోభ చూచి ఆనందించేసమయంలోనే మేము వెళ్ళేము. కన్ఫ్యూ షియస్ మల్బరీ చెట్టు క్రిందనే జన్మించేడు, తెలుసా.

మాలో పెద్దవాడు మా కష్టాలను చెపుతూంటే సావధానంగా, బహు జాగ్రత్తగా వింటూ కూర్చున్నాడు, సైన్. మా కష్టాలంటే ఆతని బంధువుల, స్వజాతీయుల కష్టాలే.......

"మా సంపాదనంతా పోగుచేస్తే రోజుకు రెండు శేర్ల నూకలు కూడా రావడంలేదు. మేము మా స్వగ్రామాలకు పోవాలనే కోరుతున్నాము. ఈ సంవత్సరము వర్షాలు లేవు. అక్కడివాళ్ళే తిండిలేక, పనులులేక అల్లాడుతున్నారు. జపాన్ పెట్టుబడిదార్లతో మేము చేస్తూన్న పోరాటంలో నీవు మా కేదయినా సహాయం చేయాలి. కులపెద్దవనీ, మన వాళ్ళందరిలోకీ అనుభవనీయుడవనీ తలచి, మేము నీ దగ్గరకొచ్చి సహాయాన్ని అర్థించేము. నీవూ పెద్దవర్తకుడవు. జపాన్ వాళ్ళు మన దేశాన్ని, మన ధనాన్ని, ప్రజల్ని యెల్లా దోచుకుంటున్నారో, నీకు తెలియదూ? నీవు మన జాతివాళ్ళను అభిమానించవూ? ఈ జపానీయులు మన చైనీయుల్ని ఎలా నాశనం చేస్తూన్నదీ, నీకే తెలుసును."

అని మా రాయబారం పూర్తి చేసేము.

'మిష్టర్ శ్మైన' వెంటనే యేమీ సమాధానము యివ్వలేదు. చాలాసేపు ఆలోచించేడు. అతడు మాట్లాడ నారంభించినప్పుడు, మాకేదో దారిచూపి తీరుతాడని, మా కందరికీ ఆశ కలిగింది.

"కొంతసేపయిన తర్వాత శ్మైన మాట్లాడడం ఆరంభించేడు. "చ్వాంగ్ - ట్జీ యోగిపుంగవుని కథ విన్నారు కదూ? అతడు ఒకరోజున నిద్రలో తాను సీతాకోకచిలుకగా అయినట్టు కలగన్నాడు. పువ్వుల మీంద యెగురుతున్నట్లూ, తాను చ్వాంగ్ - ట్జీ కానట్లూ భావం కలిగింది. మెలకువ వచ్చిన తర్వాత అతనికే పెద్ద సందేహం కలిగింది. చ్వాంగ్-ట్జీయే నిద్రలో తాను సీతాకోకచిలుక అయినట్లుగా కలగన్నాడా? లేక సీతాకోకచిలుకే నిద్రలో చ్వాంగ్-ట్జీ అయినట్లు కలగన్నదా? లేకపోతే చ్వాంగ్-ట్జీయే సీతాకోకచిలుకా? - లేక రెండూ కూడా ఒకే పదార్థముయొక్క వివిధావస్థా భేదములా?"

"నిజం చెప్పాలంటే నేను యిప్పుడు చ్వాంగ్

ట్టీ అవస్థలోనే పడ్డాను. చైనాదేశీయుణ్ణి, వర్తకుణ్ణీ, అవడంవలన నేను మీకు సహాయం చేయవలసిందే నని ఒప్పుకోవాలి. ఈదృష్ట్యా, మన యిద్దరిప్రయోజనాలు విరుద్ధములు గావు. కాని అదృష్టవశాత్తు నేను భూస్వామిని; పెట్టుబడి దారుడను; కంప్రెడోర్ను; [విదేశీ పెట్టుబడిదార్లకు, చీనాప్రజలకు మధ్య దళారీగా పనిచేసే వర్తకుడు] అందువల్ల నేను మిమ్మల్ని ముందుగా, మూడు ప్రశ్న లడుగుతాను. దాటికి సమాధానం చెపితే తర్వాత, నేనొక నిర్ణయానికి రాగలుగుతాను.

"ఒకటి:- పత్తిమార్కెట్టులో ధరలు యింకాపడిపోయి ప్రజల్లో ఆందోళన యింకా హెచ్చుపెరుగుతే, నా భూమిలో ప్రత్తిసాగుచేసే రైతులదగ్గరనుంచి శిస్తు వసూలు చేయనా? వద్దా?

రెండోది:- నా పడవల మీదా, సరుకు కొట్లలోను, పనిచేసే కూలీల విషయం ఏమిటి? వాళ్ళు తమ ప్రస్తుతావస్థతో తృప్తిపడి వూరుకుంటారా?

మూడోది:- నాకు జపాన్ వాళ్ళ దగ్గరనుం

చి వస్తూన్న ప్రతి ఆర్డర్లు పోకుండా వుంటాయా? నాకు కలిగే నష్టానికి బాధ్యు లెవరు?

అదీగాక కూలీల్లో యీ గందరగోళం పెచ్చు పెరిగిపోతే, జపాన్ పెట్టుబడదార్లు ఒక్కళ్ళు మాత్రమే నష్టపడుతారనీ, మేము, చైనా భూస్వాములం, వర్తకులం, నష్టపడమనీ హామీ యేముంది? మావల్ల బ్రతుకుతూన్న రైతులూ, కూలీలు కూడా మాకు తగిలేదెబ్బ వల్ల నష్టం పొందుతారు కదా? అందు చేత, కన్ఫ్యూషియస్ చెప్పినట్లుగా "తండ్రి తండ్రిగా వుండాలంటే కొడుకు కొడుకుగానే వుండి పోవాలి." ఈ వచనాన్ని మనం మరచి పోకుండా వుండడం వివేకం. ఇంతే నేను చెప్పేది."

ఈ మాటలు విని, తాను పేతాకొకచిలుకో, "చ్వాంగ్-ట్జే" యో నిశ్చయించుకో జాలకుండా వున్న పైన దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయేము.

తరువాత కొద్దిరోజులకే మేము, మా పనులలోకి వెళ్ళవలసివచ్చింది. కాని, ఏదెల్లా వున్నా, సమ్మె జరిగిన తర్వాత మేము మునుపటి కూలీలము

గాము. ఇంజనీయర్ పాంగ్ మాకు క్రొత్త పాటలు నేర్పుతున్నాడు. బిచ్చగాళ్ళూ, కళాసులూ పాడుకొనే పాతపాటలకు బదులుగా, యివే పాడుతున్నారు, వాళ్ళూ."

ఇలా చెప్పి ముగించి స్సై- హెూ- సిన్ చైనాభాషలో "ఇంటన్-నేషనల్" పాడి వినిపించేడు. వీపులమీది ప్రతి బేళ్ళ క్రింద క్రుంగి నడుస్తూ పడవ కళాసులు విధీ విరామం లేకుండా, ఫ్యాక్టరీ లోకి పోతూనే వున్నారు. వాళ్ళ మూలుగులు, యింటర్-నేషనల్ కి 'లయ' వేస్తూన్నాయి.

ఓ హెూ హెూ! ఏ హే హే!

ఆ హూ లీ! ఆ హీ హీ!

# రైతుల తిరుగుబాటు

జర్మనుల చుట్టా, రష్యనుల సిగరెట్టూ, ఇంగ్లీషువాళ్ళ పైపూ, కూడా కాల్చుకుంటూనే ఏపనైనా చేసుకోవచ్చును; మోటారు నడుపుకోవచ్చు; చెక్కులమీద సంతకాలు పెట్టవచ్చును; చెప్పులు కుట్టుకోవచ్చు; చేను కోసుకోవచ్చు; ఓడల్లోకి బొగ్గు ఎగుమతి చేయవచ్చు. కాని, చైనీయుల పొగగొట్టం మాత్రం ఆలాంటిదికాదు. నేను మొట్టమొదటి సారి దాన్ని ఒక పెద్ద భూస్వామి యింట్లోని, ఓ పెద్దగది లో చూసేను. ఆతడి వంశనామం "లో". అది కాలుస్తూన్నంత సేపూ ఒక చేతితో గొట్టాన్ని పట్టుకునే వుండాలి. ఒక్క పీల్పుకు సరిపడే పొగాకు మాత్రం అందులో పెట్టి, కాల్చి, మళ్ళీ పెడుతూనే వుండాలి.

పొగపీలుస్తూ వున్నంత సేపూ, పొగాకు పెట్టినప్పు డల్లా, పుల్లతో వెలిగిస్తూనే వుండాలి. టర్కీ వాళ్ళ 'నార్గిలా' కూడా యిల్లాంటిదే. పొగ, గొట్టము ద్వారా నీళ్ళలోనుంచి 'బుడబుడ' మని వస్తూంటుంది. ఈ పరికరంలో ముఖ్యమైనది, ఒకలోహపు కూజా. దానిమీద మంచి పనితనంగా 'గండ భేరుండము' బంగారు నీటితో చిత్రించబడివుంది. 'భూస్వామి' యొక్క ధనం వినియోగపడే మార్గాలలో యిల్లాం టివే ముఖ్యమైనవి. ఇవి కనిపెట్టిన వాళ్ళు సోమరి పోతు తనానికీ, వృధా కాలయాపనకీ కూడా దీన్ని చిహ్నంగా చేసివుండాలి. ఇది ఉపయోగించే వాళ్ళకి పొగ త్రాగడమే ఒక గొప్ప రాచకార్యం! వాళ్ళకి యింతకంటె మరేమీ పనేవుండదు!

ఆ భవంతి ప్రస్తుతం ఖాళీగానే వుంది. నేను చూసిన వస్తువుల్లో చాలచిత్రములైనవి, ఎన్నో వు న్నాయి. వాట్లనిగురించిన వివరాలు తెలుసుకోడా నికెంతో కుతూహలమయింది. అరగజం పొడుగున వున్న దంతపు బెత్తం ఒకటి; దానికి ఒకవైపు, చెయ్యి

లా చెక్కబడివుంది. వీపుగోక్కునేటందుకు యిది ఒక సాధనం! జానెడుపొడుగు పుల్ల ఒకటి; బిరుసువెంట్రుకలతో ఒకప్రక్క చిన్నబుడిపిలా కట్టివుంది. యిది చెవుల్లో గులివి తీసుకునేటందుకుట! ఈగల్ని చంపేటందుకు గుఱ్ఱపు వెంట్రుకలతో కట్టిన కుంచ ఒకటి; చడీ, చప్పుడూ లేకుండా, యీ సాధనవిశేషంతోటి యీగల్ని యిట్టే చంపవచ్చును,

'లో' యింట్లో, నేను చూసినవి, యింకా యీలాంటి పనిముట్లు యెన్నో వున్నాయి. రోజు రోజంతా సోమరిగా కూర్చుని, కాలం గడిపే వాడికి యివన్నీ అత్యంతావసరము లైనవే. బియ్యపు సారా తాగడానికి రంగురంగుల పింగాణీగాత్రలూ, మొఖమల్ సంచుల్లో కట్టివున్న "క్వై-ట్జీ" [అన్నముతినే పుల్లలు]; "మహ్-జాంగ్" [పాచికలపెట్టె] ఒకటి; ఇవన్నీకూడా అక్కడేచూసేను. ప్రతిరాత్రీ భూస్వామి యిల్లంతా పాచికలు ఆడే వాళ్ళ గోలతో ప్రతిధ్వనిస్తూండేదని అందరూ చెప్పేరు.

తనభూముల్ని కౌలుకిచ్చి, కాలుమీద కాలు

వేసుకుని కూర్చునే భూస్వామికి కాక మరెవరికి ఈ పనిముట్లు కావాలి? తనభూమినంతనూ ఖండఖండా లుగా విభజించి, రెండువందలు పైగా రైతులకు మక్తాలకు యిచ్చి, తన కోటలో కాలు మీద కాలే సుకుని 'షహా జంగ్' అనుకుంటూ కూర్చుంటాడు. ఆతని దినచర్యలలో, హుక్కా పీల్చడమూ, దంతపు చేతితో వీపు గోక్కోడమూ, ఈగల్ని చంపడమూ, ఇవే మహత్కార్యాలు. కోట చుట్టూ పెద్ద యెత్తయిన గోడ; బ్రహ్మాండమయిన బురుజులు; నడిమధ్యగా ఆకాశాన్నంటే చతురశ్రగోపురము. జూన్, అక్టో బరు నెలలలో, రెండు పంటలూ ఫలించిన రోజులలో రైతులంతా పెద్దపెద్ద ఆల్లిక గంపలతో ధాన్యము పట్టించుకుని, గుంపులు గుంపులుగా కోటలోకి వచ్చి, ప్రాంగణంలోని, పెద్ద పెద్ద సిమెంటుగానులలో పోసి పోతూంటే, గోపురం మీంది గదిలో కూర్చుని, కిటికీ లోనుంచి వీళ్ళను చూస్తూంటాడు. భూస్వామి 'లో' కి యింకో ఆధీ వ్యాధీ లేనేలేదు.

రైతులు ఎండా వానా అనక, మోకాల్లోతు

బురదలోనూ, ముళ్ళలోనూ, పగలల్లా నడుంవంచి కష్టపడతారు. నారుపోసి, ఊడ్చి, కలుపుతీసి, కోసి, నూర్చి,- బంగారం లాంటి ధాన్యము తెచ్చి, పండిన పంటలో సగం పయిగా భూస్వామియింట్లో పోసి, వెళ్ళిపోతారు. భూస్వామి హుక్కా-పీలుస్తూ, దంతపుచేతిలో వీపుగోక్కుంటూ, 'మహ్-జాగ్' రాత్రి పగలూ అనకుండా ఆడుతూ వుంటాడు; మేడ మీాది కిటికీలోనుంచి అదేపనిగా చూస్తూనే వుంటాడు. ఈ విధంగా పదులూ, వందలూ, వేలూ సంవత్సరాలు గడిచిపోయింది. "లో" కుటుంబీకులు తరతరాలుగా, కొంచె మించుమించుగా యీ విధమయిన దినచర్యలతోనే కాలక్షేపంచేస్తూ, అదే కిటికీలో నుంచి శూన్యదృష్టులతో లోకాన్ని చూస్తూనే గడిపేసేరు.

సోమరిపోతుగా కూర్చునేవాడికి రోజులో యిరవైనాలుగు గంటలూ యేలా జరిగిపోతాయో? నని, భూస్వామి 'లో' ను ప్రశ్నించుదామని ఎంతో కుతూహలం కలిగింది. అతణ్ణి యీ లాంటి బాతాఖానీలోకి దింపడం, ఎంతో వినోదకరంగా వుండితీరుతుం

దనే నా నమ్మకము. కాని యీ విషయంలో నాకు ఆశాభంగము కలిగింది. మన దురదృష్ట వశాత్తూ, భూస్వామి ప్రస్తుతం గ్రామంలో వుండడం లేదు. "జిల్లా రైతుసంఘం" అతనికోటనూ, భవనాన్నీ స్వాధీన పరచుకున్న రోజున ఎక్కడికి పరారీ అయి నాడో యెవరికీ తెలియదు. అందుచేత యీ ప్రశ్న నే అక్కడున్న వాళ్ళ నడిగేను.

మేము యినపగేటు తలుపులు తెరుచుతుని, కోటదాటి బైటకు వెళుతున్నాము. మేమంటే,- నేనూ, నాతోవున్న ఇన్ - లీ - సాన్. చైనీయులకు సర్వసాధారణ మయిన నీలిరంగు చొక్కా తొడు క్కొని, దానిమీద 'రైతుసంఘము' యొక్క 'బాడ్జీ' తగిలించుకుని, సగర్వంగానడుస్తూ, ఇన్- లీ- సాన్, భూస్వామి పూర్వగాధను చెపుతూన్నాడు.

రోడ్డుకు రెండుప్రక్కలా వరిచేలే. చేలల్లోని తేటనీటిలో వినీలాకాశం ప్రతిఫలిస్తూంది. పచ్చనివరి మొక్కలు వరుసలు దీరి సిపాయీల్లాగ నిలుచుని, గాలికి యిటు అటు వూగుతూన్నాయి. కనుచూపు

మేర, ఎక్కడచూసినా వరిచేలే, పచ్చటి తివాసీపరిచి నట్లుగా, కన్నులపండుగ చేస్తున్నాయి. చిన్న చిన్న కాలువలు మర్మర ధ్వనులతో మెల్లగా ప్రవహించి పోతూన్నాయి. సూర్యకాంతిలో మెరుస్తూన్న సమాధిరాళ్ళు రోడ్డుకు రెండుప్రక్కలా నిలబడి, మానవు నికి నిత్యమూ మృత్యుదేవత సన్నిహితమై వుందని జ్ఞాపకం చేస్తూన్నాయూ! అనిపిస్తూన్నాయి. రంగుల సీతాకోకచిలుకలు గోవగా మొసుగుతూన్న వరిమొ క్కలమీంద వాలుతూ, ఎగురుతూ, యింద్రధనుస్సు రంగుల్ని స్ఫురింప జేస్తూన్నాయి. గండు చీరండల యీలలతో చెవులు గింగురు మంటూన్నాయి. ప్రకృతి అంతా బహు రమణీయంగా నూ, హృదయోల్లా దకరంగానూ వుంది.

ప్రకృతికే మరింత సౌందర్యాన్ని కూర్చవల సిన మానవునిస్థితి, ఎక్కడా హృదయ విదారకంగానే వుంటూంది, ప్రస్తుత సమాజములో. చీనాలో యిది మరింత విస్పష్టంగా కనుపిస్తుంది. మోకాల్లోతు బుర దలోనూ, నీళ్ళలోనూ, కూలీలు, వంచిన నడుం ఎత్త

కుండా వరినారు ఊడుస్తూన్నారు. నెత్తి మీద తుంగ టోపీ, ఒక చిన్న యిజారు,– యివే వాళ్ళ దుస్తులు. ఎండకు యెండీ, వానకి తడిసీ పనిచేయడంవలన వాళ్ళ పచ్చటి శరీరాలు కమిలిపోయి, నల్లపడ్డాయి. మేము వాళ్ళని దాటి పోతూంటే, తలయినా ఎత్తి చూడకుండానే వాళ్ళు తమపనులలో మునిగివున్నారు.

"ఊరు యింకా అయిదు 'లీ' ల దూరము వుంది. ఈ లోగా 'లూ' ఆఖరిదశను గురించి చెప్పు కుంటూ పోవచ్చు," నన్నాడు, ఇన్ లీ- సాన్.

"అది పన్నెండో నెల. సంవత్సరాది సమీపిస్తూంది. పన్నుల వసూళ్ళు, భూస్వామి మక్తాలు చెల్లించడం, అప్పులకాతాలు పరిష్కారం చేసుకోడం, యివన్నీ అప్పుడే జరుగుతూంటాయి. వర్తకులంతా ఎద్దు చర్మాలు మొదలయినవి పోగుచేసుకుని, రయితుల దగ్గర ధాన్యము, అపరాలు వగైరాలు కొనుక్కొని పట్టణాలకు పోతున్నారు. అక్కడ వీట్లనన్నిటినీ విక్రయించి, కిరసనాయిలూ, కిరాణా సరుకులు, యింకా పల్లెటూరి వాళ్ళకు అవసరమైనవి యెన్నో

కొనుక్కుని, సంవత్సరాదినాటికి తమ గ్రామాలకు చేరుకుంటారు. రయితులు, మట్టి పాత్రలను చేసి, మెరుగు పెడుతూ, తీరిక లేకుండావున్నారు. రయితు స్త్రీలందరూ రాట్నాల దగ్గర నూలు వడుకుతూ తొందరగా వున్నారు. చిన్న చిన్న పిల్లలు వీధుల్లో, రోడ్లమీదా తిరుగుతూ, పొయిలోకి చితుకులూ, ఎరువుకు పేడా యేరుతున్నారు. వసంతకాలపు వ్యవసాయపు పనులింకా అప్పటికి ఆరంభం కావు. పండుగుల ముందర గ్రామాలన్నీ సందడిగానూ, ప్రశాంతంగానూ వున్నాయి.

"ఒకరోజున ఉదయాన్నే సాయుధమైన పది మంది 'మిన్ టాంగ్' సిపాయీలు జట్టుగా, రైతులందరి యిళ్ళకూ తిరుగుతూన్నారు. మా వూళ్ళో 'స్యా- టిన్' అంటూ ఒక రయితు వున్నాడు. అతడు కొంతకాలము పట్టణములో బాణా సంచా వర్తకుడిదగ్గర పనిచేసి, అప్పటికి మావూరు తిరిగి వచ్చి వ్యవసాయం చేస్తూన్నాడు. అతడికి లోకానుభవం చాలా వుంది. భూస్వామి 'లో' దగ్గరే పది 'మూ'

ల భూమి కౌలుతీసుకుని సాగు చేస్తూన్నాడు. అక్క డికే రయితులంతా గుమిగూడేరు. నేనూ వెళ్ళేను. 'మిన్- టాంగ్' సోల్జర్లు, యేడుస్తూన్న 'చౌ' ను యింట్లోనుంచి బైటకు లాక్కొచ్చేరు. అప్పటికే ఏభై అరవై మంది రయితులు పోగయేరు. స్యో-టిన్ ముందుకు వెళ్ళి 'సంగతి ఏమిటి?' అని 'చౌ' ను అడి గేడు.

"మిన్ టాంగ్ సోల్జర్లు, భూస్వామి దగ్గర నుం చి వచ్చి, పందిని కోసుకున్నందుకు పన్ను చెల్లించ మని పీడిస్తూన్నారు. నాకు అసలు పందే లేదని మీా కెరుగుదురు కదా? నేను పన్ను ఎందుకు చెల్లించాలి చెప్పండి?" అని 'చౌ' వాపోయేడు.

"రైతులందరూ అతడికి పందే లేదని చెప్పేరు. కాని వినే దెవరు? సోల్జర్ల నాయకుడు మండి పడు తూ, 'లో స్యాన్- పిన్ కి తన రైతులందరి పేర్లు జ్ఞాపకమా ఏమిటి? రైతుల్లో ఎవడికి పందుందో, ఎవ డికి కోడుందో తెలుసుకోవడమే అతనికి పనా ఏ మిటి? పన్నులు వసూలు కావాలా? అక్కర్లేదా?

అందుచేత భూస్వామి, రైతులందరి దగ్గరా పన్నులు వసూలు చేయడానికి ఆర్డరు యిచ్చేడు. ఎవడు చెల్లించకపోతే వాడిని ఎరస్టు చేయడానికి మాకు హుకుం అయింది,' అన్నాడు.

“పెద్ద గోల బయలు దేరింది. రయితులంతా కేకలు ప్రారంభించేరు. స్యూ టిన్ అందుకుని, 'నేనూ పట్టణం పోయి వచ్చిన వాణ్ణే. నాకూ రూల్సు తెలుసును. పాదిని కోసినందుకు పన్ను, పంటలున్న వాళ్ళ దగ్గరే వసూలుచేయాలి. 'చో' వద్ద అసలు పండే లేదు,' అంటూ మొత్తుకున్నాడు.

“యజమాని 'లో' పన్నులు వసూలు చేసే వాడు. అతనికి, నీ పాటి తెలియ దనుకున్నావా? జాగ్రత్త!” అంటూ, 'విన్ టాంగ్' నాయకుడు, రైతుల్ని వెళ్ళిపొమ్మని గద్దించేడు. వాడిమాటలు ఎవరూ వినిపించుకోలేదు. ఏలాజరిగిందో జ్ఞాపకం లేదు గాని, ఓరయితు, సోల్జర నాయకుడి చొక్కా పట్టుకుని వెనక్కి లాగేడు. వాడేం చేసేడను కున్నారు? మౌజర్ తీసి, గురిపెట్టి కొట్టేడు. రైతను బాగా

గాయం తగిలింది. జనం అంతా తుపాకి కాల్పుతో బెదిరి, పరుగు లంకించుకున్నారు. స్యాటిన్, చో, యింకో యిద్దర్ని, పోలర్లు అరెస్టు చేసేరు. వాళ్ళను సంకెళ్ళలో గ్రామం వెలుపలికి లాక్కుపోతూంటే మేమందరం యిళ్ళలోనుంచి చూస్తూనే వున్నాము. భూస్వామి కోటలో కొద్దిరోజులు వాళ్ళ నలుగుర్నీ నిర్బంధంలో వుంచి, తర్వాత పట్టణానికి లాక్కుపోయేరు. పిల్లు గ్రామంలో శాంతికి భంగం కలిగిస్తూన్నారనీ, పన్నులు చెల్లించకుండా రయితుల్ని పురిగొల్పుతున్నారనీ, భూస్వామి రిపోర్టు చేసేడని మా కందరికీ పదిహేనురోజుల్లో తెలిసిపోయింది. అక్కడ చావదెబ్బలు తిని, తిరిగివచ్చిన 'స్యా-టిన్' మాతో యిదంతా చెప్పేడు. వాళ్ళ విచారణ జరిగే టప్పుడు, జిల్లా రయితు సంఘం రైతుల పక్షాన్ని వాదించి, విడిపించిందట. కాని విచారణ జరిగిన 'యామెన్' [కచేరి] గుమ్మందాటి బయటకి వచ్చేసరికి "లో" త్రాలూకు మిన్ టాంగ్ పోల్జసు, మా వాళ్ళని పట్టుకుని తుపాకి మడమలతో చావబాది వదలిపెట్టేరు. చో,

యింకో రయితూ కూడా ఆదెబ్బలకు చచ్చిపోయేరు.

"కాని పట్టణంనుంచి ఊరికే దెబ్బలు మాత్రి మేతిని రా లేదు. "టోయిస్టు యోగులిచ్చే దివ్యమైన "జెచ్ వాన్" మాత్రల కంటెనూ మన కెంతో మేలు కలిగించే వస్తువు నొక దాన్ని తెచ్చేను," అంటూ, స్యో-టిన్ రయితుసంఘం వాళ్ళ కరపత్రము ఒకటి చూపించేడు.

"మేమందరం కొంతసొమ్ము చందా చేసేము. లియూన్-టీ హోటలులో కూర్చుని, వేయించిన చిక్కుడు గింజలూ, బఠానీల పులుసూ, సారా తెప్పించుకుని, విందుచేసుకుంటూ, ఆలోచనలు సాగించేము. రాత్రి ఎంతో పొద్దుపోయీ వరకూ అక్కడే కూర్చుని, మా కష్ట నిష్ఠురాల్ని గురించి చర్చించుకున్నాము. ఇంతకీ పర్యవసానం యేమిటంటే, ఆ శీతాకాలంలోనే, పంటల్ని కోసుకున్నందుకు చెల్లించవలసిన పన్నులో ఒక్క కానీకూడా భూస్వామికి చెల్లించలేదు. భూస్వామి కీయవలసిన అప్పులమీద వడ్డీలు కూడా చాలమంది రయితులు చెల్లించలేదు.

మా వూళ్లో రైతుసంఘం కూడా ఏర్పాటు చేసుకున్నాము. ఈ విధంగా పని ప్రారంభ మైంది. ఇంతలోకే వసంతకాలం సమీపించింది. రయితులు తెల్లవారగట్లే లేచి, నాగళ్ళు బుజాన పెట్టుకుని, పొలాలు దున్నుకునేటందుకు పోతూన్నారు. మోకాళ్లోతు నీళ్ళలో, కర్రనాగళ్ళతో దున్ని, దమ్ముచేయడం ఆరంభించేము. సూర్యోదయము మొదలు సూర్యాస్తమయం వరకూ చెమటోడ్చి పని చేస్తూన్నా రైతుల ముఖాల్లో ఉత్సాహమే కనిపించేది! భూస్వామికి, తమ కష్టార్జితంలో సగభాలు పెట్టనక్కరలేకుండా చేసుకోగలమనే ధైర్యం మాలో ఆ యేడు నూతనచైతన్యం కలిగించింది. ధాన్యాన్ని గంపంతో పట్టుకెళ్లి, భూస్వామి యింట్లోని సిమెంటు గాదులలో పోసి, తాము, పెళ్ళాం బిడ్డలతో గంజినీళ్ళకైనా గతిలేకుండా, కుడిసెలలో కృంగిపో నక్కరలేకుండా వుండొచ్చును! ధాన్యము పట్టణానికి తీసుకెళ్లి, అమ్ముకుని, కిరసనాయిలు, ఉప్పు, కిరాణాలు తెచ్చుకుని, సంవత్సరం పొడుగునా ఆలు బిడ్డలతో

సుఖంగా తినగలమనే ఆశ కనిపించినప్పుడు వాళ్ళకు పట్టు పగ్గా లున్నాయా? దమ్మిలు మాంచి వుత్సాహంగా చేసేము, అందరమూ.

"లో యొక్క మిన్ టాంగ్ సోల్జర్లు మళ్ళీ శిస్తుల వసూళ్ళకు మా వూరి కొచ్చేరు. శిస్తులు చెల్లించక పోతే, రయితుల భూములన్నీ లాక్కొని, యింకొకళ్లకు అమ్ముకుంటారని తెలియడంతోనే గ్రామమంతా అట్టుడికి పోయింది. రయితులంతా సత్రం దగ్గర పోగయ్యేరు. కోపంగానూ, ఉద్రేకంగానూ వున్నారందరూ. కానీ, మాకెవరికీ ముందు దారి తెలియదు. స్యూ-టిన్ రాకపోతే ఎవరితిన్న వాళ్లు చప్పగా జారిపోయే వాళ్లే. సరిగ్గా సమయానికే అతను పదిహేనుమంది రయితుల్ని వెంట బెట్టుకుని ప్రత్యక్షం అయ్యేడు. వాళ్ళందరి దగ్గరా తుపాకులున్నాయి; అందరూ సోల్జర్ల లాగే అడుగులు వేస్తూ నడుస్తూన్నారు. వాళ్ళని వీధులలో చూసేటప్పటికే, మాకెవరికీ వాళ్ళు తెలియలేదు.

"వాన్-సుయ్! వాన్ సుయ్!" [వర్ధిల్లుగాక!]

అంటూ, ఉత్సాహోద్రేకాలతో వాళ్ళకి స్వాగతం యిచ్చేము.

"ఆ తరవాత తెలిసింది. సోల్జర్లు రైతులయిండ్లకు వెళ్లి, ఘర్షణ పడే టప్పుడే, స్ట్యాటిన్, ఆతడి మనుష్యులూ వెళ్లి, ఒక్కొక్కడినే బెదిరించి, తుపాకులు లాగేసేరుట! ఎంత సాహసమో చూడండి! స్ట్యాటిన్ సత్రందగ్గరేవున్న డిబ్బమీదనిల్చుని, రైతుల్ని హెచ్చరించడం ప్రారంభించేడు. వెంటనే 'రైతు సైనిక దళం' ఒక దాన్ని యేర్పాటు చేసుకుని, భూస్వామి పనిపడదామని చిన్న ఉపన్యాసం యిచ్చేడు. మా కందరికీ ఉద్రేకం హెచ్చుపెరిగి పోయింది. ఇదివరలో స్ట్యాతో బాటుగా అరస్టు చేయబడి, పట్టణంలో చావదెబ్బలుతిన్న రెండో రైతుకూడా మాట్లాడేడు. తన దెబ్బలు చూపించి, రయితుల కష్ట నిష్ఠురాలు చెపుతూంటే, ఆతడి కళ్ళలో నీళ్ళు గిర్రునతిరిగేయి. అక్కడ చేరిన వాళ్లలో కళ్లనీళ్లు పెట్టనివాళ్లు లేరంటే నమ్మండి. తరువాత యింకా కొందరు మాట్లాడేరు. అక్కడ వున్నవాళ్లలో భూస్వామివల్ల అప

కారం, అవమానం పొందనివాడొక్కడూ లేడు. తన ధరావతు సొమ్మపహరించి, భూమి మరొకడికి కౌలు కిచ్చేడని ఒకడు; అప్పుపెట్టి, తన గొడ్డూ, గోదా అమ్మించి, పాడుకొన్నాడని, మరొకడు; అనవసరంగా శిస్తు ఎక్కువ వసూలుచేసేడని, యింకోడు; యిల్లా అందరూ తామిదివరలో భూస్వామివల్ల పడ్డ బాధలు ఏకరువు పెట్టేరు. ఓ రైతు దగ్గర్నుంచి ఆతడి స్వంత భూమిలో పండినపళ్ళలో సగంపైగా 'యీనాం' పేరుచెప్పి కాజేసేడుట, యజమాని 'లో'! మక్తాధాన్యాభూకంలోనూ, కౌలతలోనూ రయితులందర్నీ దగా చేసినవాడే, భూస్వామి! రయితుల గోడుతో సభ అంతా మ్రోగిపోయింది.

"అంతలోకే ఓ ముసలమ్మ యేడుస్తూ వచ్చిండి. భూస్వామి సోల్జర్లు ఆమె భర్తనే యేడాదిక్రిందట పట్టణంలో కొట్టి, చంపేరు. తన బిడ్డలూ, తానూ కూడా తిండికైనా లేక మలమల మాడిపోతూన్నామని చెప్పినపుడు అక్కడివాళ్ళందరికీ ఆవేశం కలిగింది. తన చిన్న పాదాలమీద అటూ యిటూ ఊగి

పోతూ, భూస్వామి మానవ భక్షకుడనీ, బందిపోటు దొంగనీ, తాచుపాములాంటి వాడనీ తిట్టి, శాపనార్థాలు పెట్టింది.

"సాయంకాలం అయింది. చీకటి కూడా పడుతూంది. అయినా ఒక్కరయితూకూడా అక్కడనుంచి కదలలేదు. చంద్రుడు పర్వతాల చాటునుండి పైకెక్కి వచ్చేడు. దూరంగా యెవరో యిద్దరు మా వైపుకే తొందరగా వస్తూన్నారని గుడ్డిగావున్న వెన్నెట్లో కనబడింది. కొద్దిసేపట్లోనే జిల్లారైతుసంఘంవాళ్ళు పంపిన ప్రతినిధులిద్దరూ మా మీటింగులోకి వచ్చేరు. చాల దూరాన్నుంచి నడిచిరావడం వల్ల వాళ్ళ పాదాలూ, బట్టలూ బూడిదకొట్టుకుని వున్నాయి. బట్టలు మాసిపోయేయి. ముఖాలు చెమటతో జిడ్డోడుతూ, అలసటను సూచిస్తూన్నాయి. భూస్వామి, గవర్నరుకు రిపోర్టు చేసేడని వాళ్ళు చెప్పేరు. గ్రామంలో రైతులు రహస్యసంఘంగా యేర్పడి, ప్రభుత్వం మీద తిరుగుబాటు చేయమని ప్రజల్ని పురిగొల్పుతున్నారనీ; పెద్దల సమాధిస్థలాల

నపవిత్ర పరచీ, దేవతా విగ్రహాల్ని కాల్చి పారేసీ, వయసువచ్చిన స్త్రీల నందర్నీ చంపివేసీ; యింకా ఎన్నో ఘోర కార్యాలు చేస్తూన్నారనీ, భూస్వామి రిపోర్టు చేసేడుట!

"గవర్నరు తనఅంగరక్షక సైన్యాన్ని యిక్కడకు పంప నిశ్చయించేడు. రెండురోజుల్లో వాళ్ళు యిక్కడికి చేరుకుంటారు. మీరు ఆత్మరక్షణాప్రయత్నాలు చేసుకోండి," అనివాళ్ళు రైతుల్ని హెచ్చరించేరు.

"అక్కడ చేరినవాళ్ళలో ఒక్కడూ భయపడలేదు. అంతకుపూర్వం సోల్జర్లంటే గడగడ వణికిపోయే రయితులు ధైర్యంతో చెలరేగి, భూస్వామినీ, గవర్నరు ప్రభుత్వాన్నీ తిట్ట నారంభించేరు. అంతకు మూడు నెలలక్రిందటే, సోల్జర్లు స్యాటిన్‌ను తీసుకుపోతూంటే పారిపోయేము. అప్పుడే గనక గవర్నరు సైన్యం వస్తూందని వింటే దూడా దాడికీ కొండల్లోకి కొట్టేసి, పెళ్ళాం బిడ్డలతో పర్వతాల్లోకే పారిపోయి వుండే వాళ్ళం! అక్కడ చేరిన వాళ్ళలో పారిపోదా

నునే వాడొకడూ లేడు. అందరూ మందిపడి పోతూ న్నవాళ్ళే. నిర్భయంగా మేమంతా పరిస్థితుల్ని ఎదు రోడానికి నిశ్చయించుకున్నాము. ఏమి చేయడం? అనేది నిర్ధారణ కాకపోయినా, చెదిరి తలాఒక దిక్కు కీ పారిపోకూడదని ప్రతీ ఒక్కడూ నిశ్చయించుకు న్నాడు. జిల్లా రైతు సంఘం నుంచి వచ్చినవాళ్ళనీ, మా గ్రామపెద్దల్నీ సమావేశపరచి, స్కోటిన్ చేయ వలసినపని నిర్ణయించేడు. నేనూ, జిల్లా సంఘ ప్రతిని ధుల్లో ఒకడూ కలిసి అరవై 'లీ' లదూరంలో వున్న పెద్దసంతకు వెళ్ళి, వీలైనంతమంది రైతుల్ని ప్రోగుచే సుకుని, మావాళ్ళ సహాయానికి తీసుకురావాలని నిర్ణయము. మేము సంతకుబోయి, మళ్ళీ రెండురోజు లదాకా రాలేకపోయేము. నేను లేనప్పుడు జరిగినది వింటేనే నా గుండెలు బద్దలైపోయినాయి......"

అంటూ, ఇన్ లీ- సాన్ ఊరుకున్నాడు.

"తర్వాత యేంజరిగింది? అని ఆతురతతో అడి గేను, నేను.

"ఆమరునాడే స్కోటిన్, రెండువందల మంది

రైతుల్ని చేర్చుకుని భూస్వామికోటను ముట్టడించేడు తన మిన్ టాంగ్ సోల్జర్లు నలభై మందితోనూ భూస్వామి కోటలో దాక్కొని, కోటతలుపులు మూసేసేడు. ప్రజలు చాలామందివున్నా, వాళ్ళదగ్గర తుపాకులు పదిహేనే వున్నాయి. మిగిలిన వాళ్ళందరూ కత్తులూ, కొడవళ్ళూ, గొడ్డళ్ళూ, బల్లేలూ, రాళ్ళూ, చేతికి దొరికిందల్లా పట్టుకుని కోటమీద పడ్డారు. మిన్ టాంగ్ సోల్జర్లందరికీ తుపాకులున్నాయి. పైగా వాళ్ళు కోటగోడల్లో దాక్కున్నారు. రైతులు బహిరంగ ప్రదేశాల్లో వుండిపోయేరు. నిచ్చెనలు వేసుకుని కోటగోడ లెక్కడానికి యెన్నో ప్రయత్నాలు చేసేరు. కాని, ప్రతీసారీ సోల్జర్లు తుపాకి గుండ్లతో ప్రజాసమూహాన్ని వెనక్కి తరిమేసేరు. మా వాళ్ళదగ్గర తోటాలుకూడా అయిపో వచ్చేయి. స్యాటిన్‌కు ఆందోళన యెక్కువైంది. గవర్నరుసైన్యం వచ్చేలోగానే కోట స్వాధీనం చేసుకుని, మాటుగావుండి ఆత్మరక్షణ చేసుకోవచ్చునని ఆతడి ఉద్దేశ్యం. కాని, వ్యవధి తక్కువ. చాలా మంది రైతులు చచ్చిపోయేరు

ఎందరికో గాయాలు తగిలేయి. కోట చెక్కు చెద రకుండా అల్లాగే వుంది.

"ఆ పరిస్థితుల్లో స్కోటిన్ తెగించి, ప్రమాద కరమైన పనికి పూనుకున్నాడు. తాను బాణసంచా చేసేటప్పుడు తనవద్ద మిగిలిపోయివున్న మందు కొంత వుంటే దాన్ని తెప్పించి, కోటగోడల్లో ఒక దానిక్రింద గోయి త్రివ్వి మందు దట్టించేడు. పైనుంచి సోల్జరు తుపాకి గుండ్ల వర్షం కురిపిస్తూన్నా స్కో-టిన్ వెనుక తీయక మందుకూరి, గని సిద్ధంచేసేడు. అతడు సంకే తం చేయగానే ఒక రైతు గనికి నిప్పంటించేడు. మిగి లినవాళ్లు గని పేలగానే కోటమీద పడడానికి సిద్ధం గా వున్నారు. చెట్ల చాటున, గుట్టల మాటునా రై తులు పులుల్లాగ కాచుకొని వున్నారు. మందుగని ఎప్పుడు పేలుతుందా అని అందరిదృష్టి అక్కడే వుంద. స్కోటిన్, ఉద్రేకంతోనూ, ఉద్వేగంతోనూ గని అం టుకోడం చూస్తూ, ప్రక్కవాడి జబ్బ పట్టుకుని నలి పేస్తూన్నాడుట! ఒక్కడూ ఊపిరి కూడా పిడవడం లేదు! కొద్దిసేపట్లోనే మందుగని అంటుకుని, చెవులు

ఘడియలు పడేలాగ పెద్ద చప్పుడుతో పేలింది. పెద్ద పెద్ద రాళ్లుకూడా తుక్కు తుక్కుగా ఎగిరిపో యేయి. అంతటా దుమ్ము క్రమ్ముకుంది. కాని, కోటత లుపులుమాత్రం విడిపోలేదు. స్యాటిన్ తెల్లబోయి, తటాలున మూర్ఛలో మునిగేడు. జరిగినదేమిటో రయితులకి అవగాహన కాలేదు. సంకేతం యియ్యకుం డానే వాళ్ళు గనిపేలిన చోటనుంచి యెదిరించడా నికి ముందుకురికేరు. సోల్జర్లు గుండ్లవర్షం కురిపించి రయితుల్ని వెనక్కి తరిమికొట్టేరు. తరువాత రెండు గంటల్లోనే గవర్నరుపంపిన సైన్యం వచ్చి చేరింది. కోటతలుపులు తెరచుకున్ని, మిన్ టాంగ్ సోల్జర్లు బ యటికి వచ్చి, వాళ్ళతో కలసేరు. ఆ రాత్రి తెల్ల వార్లూ కాల్పులూ, దోపిడీ సాగింది. రైతుల్ని కాల్చి పారేసీ; పశువుల్నిచంపీ; యిళ్ళూ, గడ్డి వాములూ తగులబెట్టీ; స్త్రీలను చెరచీ; ఒక టేమిటి? సోల్జర్లు నా నాభీభత్సంచేసేరు.

"కాని, మిన్ టాంగ్ సోల్జర్లు అందరి కంటే ఎక్కువగా తమ క్రౌర్యాన్ని ప్రదర్శించేరు. తెల్లవార

గట్లు, స్యోటిన్, యీకోయిద్దరు రైతులూ గ్రామం వెలుపల ఒక గుహలో దాగుకొని వుండగా పట్టుకుని గ్రామంలోకి లాక్కొచ్చేరు. దారిపొడుగునా సోల్జర్లు వాళ్ళను బాదుతూ, తన్నుతూ, కత్తుల్తో పొడుస్తూ, చేతనైనన్ని విధాల హింసిస్తూ లాక్కొచ్చేరు. స్యోటిన్ ఎడమ చేతిని రెక్క దగ్గర్లోకి లాగేసేరు, ఆ కిరాతకులు. 'జ్వెన్-హ్వేన్' ఆలయంలోకి వీళ్ళను తీసుకుపోయి, బట్టలు విప్పేసి, చేతులూ, కాళ్ళూ, తాళ్ళతో కట్టేసేరు. శరీరాల మీద కిరసనాయిలు పోసి, నిప్పు ముట్టించి, సోల్జర్లు ఆనందించేరు. సగం కాలేటప్పటికి స్యోటిన్ ను కట్టిన తాళ్ళు తెగిపోయేయి. ఆతడు సగం ప్రాణాలతో మంటల్లో నుంచి బయటకు పరుగెత్తుకుని వచ్చి,- "సైనిక ప్రభుత్వం నాశన మైపోవాలి!" "జమీందారీ విధానం అంతం కావాలి!" అంటూ కేకలు వేసేడు!

"సోల్జర్లు అతన్ని పట్టుకుని బల్లేలతోనూ, సన్నిలతోనూ పొడిచి, మంటల్లో పడేసి కాల్చేసేరు."

ఇక్కడికి చెప్పి ఇన్ లీ సాన్ ఊరుకున్నాడు.

అతనికింక నోట మాట రావడంలేదు. నిశ్చేష్టుడై, నేల వైపు వెర్రి చూపులు చూస్తూన్నాడు. అప్పటికి వూరు సమీపించేము. మట్టిగోడలూ, పెంకుటి కప్పులూ పది బారల్లో కనిపిస్తూన్నాయి. దున్నపోతుల వీపుల మీద పండుకుని, పశుల గాపరులు, మందల నదిలిస్తూ తోలుకు పోతూన్నారు. బురద గుంటల్లో దున్నలూ, గేదెలూ, పొర్లాడుతూ, సుఖాను భూతిలో వున్నాయి.

"మీరు మళ్ళీ గ్రామంలోకి వచ్చినపుడు ఏమయింది?" అన్నాను, నేనూ పట్టజాలక.

ఇన్ లీ-సాన్, ఒక్క నిట్టూర్పుతో మళ్ళీ చెప్పడం ఆరంభించేడు.

"మేము జిల్లా సంతకు వెళ్ళిన రోజు పండుగ దినం. దేవతకు ధూపసేవచేసే రోజు. స్త్రీలూ, పురుషులూ, పిన్నలూ, పెద్దలూ, వేలకొలదీ జనం అక్కడ క్రిక్కిరిసి వున్నారు. జెండాలు ఎగురుతూన్నాయి; ఢంకాలు మ్రోగుతున్నాయి; అంతా ఒకటే సందడి. మా వూళ్ళో జరిగిన విషయాలు చెప్పేటప్పటికి జనం

అంతా ఉత్సవంమాట మరచిపోయేరు. ఎందరో మాకు సహాయంగా రావడానికి సిద్ధ పడ్డారు. కాని, ఆయుధాలు తెచ్చుకోడం, వాళ్ళ గ్రామాల్లో మరి కొందర్ని కూడా తీసుకురావడం, - యివన్నీ పూర్తిగా ఆ రోజంతా పట్టినాయి.

"మరునాడు తెల్లవారుతూ వుండగా మేము బయలుదేరేము. మొత్తం మూడు నాలుగు వందల మంది రైతులు మాతో బయలు దేరేరు. రాత్రి కొంత ప్రొద్దు పోయేక మా వూరు చేరుకున్నాము. గ్రామం అంతా శ్మశాన ప్రాయంగా వుంది. జరిగిన విషయం గ్రహించుకున్నాము. దుఃఖం, కోపం కూడా వచ్చింది. అంతే వెంటనే నిద్ర పోతూన్న సోల్జర్ల మీద విరుచుకుపడి, ప్రతీకారం తీర్చుకో గలిగేము. ఏ కొద్ది మందో బతికి బయటపడి, పారిపోగలిగేరు. కోట దగ్గిరకి వెళ్ళేటప్పటికి తలుపులు బారుగా తెరిచివున్నాయి. తన కుటుంబం తోనూ,- సోల్జర్లు, నౌకర్ల తోనూ,— భూస్వామి తప్పించుకుని పారిపోయేడు. కోట మా స్వాధీనం అయిపోయింది. రైతుసంఘం

జండా కోట మీాద ఎగిరింది... ..."

మేము గ్రామంలో ప్రవేశిస్తూన్నాము. ముందుగా బుద్ధుని రాతి విగ్రహం కనిపిస్తూంది. బుద్ధ దేవుడికి కూడా చిన్న గడ్డం తగిలించి, వాళ్ళంతా రంగులు పూసేరు! బలిపీఠంమీాద కాలిపోయిన ధూపకాష్టాలు పడున్నాయి. పునర్జన్మ సిద్ధాంతాన్ని బౌద్ధులు అంగీకరించేరు. అది నిజమే ఐతే భూస్వామి యొక్క ఆత్మ, ఏ సేనానాయకుడి శిబిరం దగ్గరో, ఏ గవర్నరు భవనం చుట్టూనో తిరుగుతూ వుండివుండాలి. తాను వెనక విడిచి వచ్చిన సోమరి జీవితం, హుక్కా గొట్టం, మహా- జంగ్, దంతపు చెయ్యి, పింగాణీ కప్పులూ, వెండ్రుకలకుచ్చు, త్రైప్- ట్రీ,- వీట్లనీ తలుచుకుంటూ, వాటికై తపస్సు చేస్తూ, ఆతడి ఆత్మ పరిభ్రమిస్తూందంటే నమ్మదగిన విషయమే? గండభేరుండపక్షిలా, ష్యో టిన్ తన చితి మీాది నుంచి లేచి, లక్షలకొద్దీ రూపాలతో రైతుల తిరుగుబాట్లను నడిపించకపోతే భూస్వామి కోరిక నెరవేరవచ్చు నేమో!

12 ఆగస్టు 1926. ష్యో- క్వాన్, క్వాంగ్ టుంగ్.

## మా యితర గ్రంథాలు.

| | | |
|---|---|---|
| లియో టాల్స్టాయి | * | 0-3-0 |
| హిందూదేశము: క్రైస్తవ ప్రభుత్వనిర్మాణతత్వం | * | 0-8-0 |
| ఇటలీ | | 0-4-0 |
| ఫాసిజం: కమ్యూనిజం: స్త్రీలు | * | 0-4-0 |
| సందేశం | * | 0-2-0 |
| కారల్ మార్క్సు ఉపదేశాలు | § * | 0-6-0 |
| సోషలిజం ఎందుకు | † | 1-0-0 |
| నా రష్యాయాత్ర | | 0-8-0 |
| సోవియటు కమ్యూనిజం | | 0-6-0 |
| రష్యా విప్లవం | § * | 0-6-0 |
| లెనిన్ ఉపదేశాలు | | 0-6-0 |
| పారిస్ కమ్యూన్ | | 0-6-0 |
| నాడు—నేడు | | 1-4-0 |
| విప్లవగీతాలు | * | 0-0-6 |

| | |
|---|---|
| కమ్యూనిస్టులతో- | 0-1-6 |
| రాజ్యాంగయంత్రం | 0-2-0 |
| విప్లవ సందేశం | 0-2-0 |
| చీనాకథలు | 0-4-0 |
| పల్లెటూళ్ళలో | 0-6-0 |
| కూలి-పని : పెట్టుబడి | 0-6-0 |

* ప్రతులు లేవు.

§ నిషేధించబడింది.

† తిరిగి ముద్రించబడుతూంది.

తెనుగు భాషలో వెలువడే నిత్యనూతనగ్రంథాలు కావలసి వుంటే వెంటనే మాకు వ్రాయండి. ఒకేచోటనుంచి అన్ని గ్రంథాలూ తెప్పించుకోడం వలన కనపడని ఖర్చు లెన్నో కలిసి వస్తాయి.

విశ్వసాహిత్యమాల,

ముంగండ,

(వయా) అంబాజీపేట, తూర్పుగోదావరి జిల్లా.

అవంతీ ప్రెస్, ముంగండ.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B111 |
| పుస్తకం పేరు | చకినా కైఫీలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |